శ్రీరస్తు.

# అడివిగోవిందనామములు.






ఇవి

ప్రాచీనకవులచే రచియింపబడి,

గోదావరిజిల్లా కాకినాడటవున్ బుక్కుసెల్లర్.

మాగు. వెంకటరంగనాథరావుగారిచేత ప్రకటింపబడెను.



ముద్రితసంఖ్య 1000 ప్రతులు.

COCANADA:

Printed by the N. Nityanandam at the Balasaraswaty Press
and Published by M. V. Ranganadha Row.

1906.

వెల రు 0-4-0.

శుభమస్తు

## అడివి అనేచరగోవింద నామములు.



క్షీరసాగరమందు గోవిందారామ । శ్రీహరులు ఉదయించిరి గోవిందా । పాలసాగరమందు గోవిందారామ । పరమాత్ములుదయించిరి గోవిందా । (మొదటిచరణముకు గోవిందారామఅని । రెండవ చరణముకు గోవిందాఅని పాడేది) శ్రీరామలక్ష్మణులు । చెలువలగూడుకుని । పదిరెండువర్షములు । ప్రేమతోనుండిరి । దశరథుండంతటను । తగవసిష్ఠునితోను । రామునకప్పుడు । పట్టముగట్టంగ । మంచిముహూర్తంబు । ఉంచుమనిచెప్పగా । తలయూచియామౌని । తనమదినూహించి । దశరథుతోబల్కె । ధరణీశ్వరులకెల్ల । ఆహ్వానపత్రికల్ । అంపించిరప్పుడు । బంధుమిత్రువులకు । పత్రికలుబంపిరి । పురమలంకారంబు । పొలుపుగాజేయించి । సాకేతపురిములో । సకలశృంగారములు । చక్కగాజేయించి । చాటింపుచేయించి । సకలతూర్యంబులు । ప్రబలముగమ్రోయగా వలుగాకిమంథర । ప్రాసాదముననుండి । పరికించితెల్సుకుని । పరుగుపరుగునబోయి । కైకమందిరకేగి । గుండెలుబాదుకొని । గోలెట్టియేడ్చుచును ॥ నీగర్వమంతయును । నీళ్లలోగలసెనె । పతికినీపైప్రేమ । పదిలమనుకొంటివే । కళ్లుమూసుకుపోయి । కానలేకుంటివి । అనిమొర్రబెట్టగా । ఆకైకభయమంది । యిపుడేమిమనకయ్యె । యింతగాయేడ్చేవు అనినమంథరబల్కె । నాకైకతోనపుడు । పణతిరామునకెల్లి పట్టంబుగడుదురె । యింతతెలియగలేవు । యింకనేమున్నది ఆమాటవిని కైక అధికమోదమునొంది । ముత్యాలహారంబు । ముదితమందరకిచ్చె । నాకేలక్రోధంబు । నీకొంపమునిగెను । అనగనిట్లనె కైక । ఆదాసిమంథరతో । నీకిట్టిచింతేల । నాకుసంతోషంబు । శ్రీరామచంద్రుండు । జ్యేష్ఠుండుగాపటవె । సుగుణసంపూర్ణుండు । సుజనప్రియుండుసుమి । భరతునిక

న్నునూ । పరమప్రియుడునాకు । తనతల్లికన్నను । ననుభక్తితోగొల్చు । రాజ్యాధికారంబు । రామునికియేతగును । భరతుపట్టముగట్ట । భావ్యంబుగామనుమి । అనికయికబోధింప । ఆదాసీబల్కెను । నీవింతమెరుగవె । కౌసల్యకెప్పుడు । దాసిగానుందువె । నీవుదాసివైతె । నీకునేదాసీనా । యింతకష్టమునీకు । యిపుడుసంభవమయ్యె । దానిమంత్రములన్ని । తనకునచ్చినకైక । గానితోసనెయిట్లు । అన్యాయముగనేను । అధిపుతోనేమందు । ఆమాటకదిజెప్పె । అందుకుపాయంబు । వసుధేశ్వరుడుమున్ను । వరములురెండిచ్చె । అవియిప్పుడుగోరు । అందులోనొకటిచే । అడవికంపుమురాము । మరియునొకవరముచే । భరతుపట్టముగట్టు । అనిదాసీబోధింప । ఆకైకమెచ్చుచు । యింతబుద్ధినీకు । యేవేల్పులిచ్చిరే ॥ నగలుకోకలుయిచ్చె । నాతిమంధరకపుడు ఆరాత్రికోపించి యవనిపైశయనించె । దశరథుండేతెంచి । తరుణికైకనుజూచి । నీకుకోపంబేల । నిజముదెల్పుమటన్న । మునురెండువరములు । ముదముతోనిచ్చితివి । ఆవరములిప్పుడు । అడుగసమయమువచ్చె । అందొక్కవరముచే । అడవికీరాముని పదునాలుగేడులు । వనమునకుచేవేగ । పంపివేయగవలెను । ఇంకొక్కవరముచే । భరతుపట్టముగట్టు । ఈమాటవినిరాజు । యిలనుబిట్టుగబడియె । అట్టిరామునినేను । యెట్లుగావిడతూని । నీకేమిపగజేసె । నీరజాతాక్షుండు । అన్యాయముగనేను । అడవికెట్టులద్రోతు । క్రూరమృగములనోంట । కొడుకునెట్టులద్రోతు । లోకులందరునన్ను । మూకలైతిట్టుదురు । పురవాసులందరు । పొక్కుచుతిట్టుదురు । అరువదివేలేండ్లు । ఆత్మజులనుగోరి । ముద్దుగుల్కెడువాని । ముప్పననేగంటి । కన్నకడుపైయుంట । కౌసల్యయేమౌను । మునివేషమునమున్న । తనయునేగతిజూతు । అనిదుఃఖపడుచున్న । అధిపుతోనవైకైక । ఆదిత్యకులజులు । అనృతంబులాడుదురె । అనృతమాడవటంచు । అందరందురునిన్ను । కౌసల్యపైప్రేమ । కనుపరచితివియిప్డు । భరతునితోగూడ । ప్రాణముల్ విడిచెదము । అనికయికబల్కెనా । ఆరాజుచింతించె । దశరథునాజ్ఞను । దాశరథుడం

తటను । కడసారంపుతల్లి । కాషాయములుయివ్వ । భుజకీర్తులాది
గా । ముచ్వరునుదీసిరీ । నారచీరలుగట్టె। నయమొప్పనంతటను । జట
లనుధరియించి । తిరునామములుదిద్ది । తుళశిపూసలుదాల్చి । అంబు
లపాదులను । హస్తంబులనుదాల్చి । పరగమునివేషముల । జానకీదేవి
తో । సంతోషచిత్తులయి తల్లిదండ్రులకపుడు । తగమ్రొక్కిముగ్గురూ
వకతేరథంబెక్కి । చక్కగాసుమంతుడు రథముదోలంగాను । రయము
నను వెడలిరీ । పురజనములందరూ । వరుసతోనప్పుడూ । క్రూరురాలగు
కైక కోరినకోరికలు । పట్టాభిషేకంబు । భరతునకుజేయుమని । పాపా
త్మురాలంత । పదునాలుగేడులు । అరణ్యవాసముకు । ఆరామునంపుమ
ని । కోరినసుదశరథుడు కూడదనిజెప్పక । కామాంధుడయితాను కా
దనిచెప్పడుగ । పాపాత్మురాలిదీ । పదునాలుగేడులూ । భద్రునడవికిబం
పె పట్టాభిషేకముకు । విఘ్నంబుజేసెను । విధిక్రూరుడయ్యెనూ । అ
నికైకదూరుచూ । అందరూమంవలై । రామునీగనకున్న బ్రతుకు
దుమెతుణమైన । ఈతండులేకున్న । యీఅయోధ్యేటికీ । యిళ్ళేలతను
వేల । యింకజీవనమేల । అందరముయిప్పుడే । అరణ్యవాసముకు । రా
మచంద్రునితోడ । రయమునసుపోవుదము । అనిపల్కిపౌరులు । అం
దరూగూడుకుని । గట్టిగాయేడ్చుచూకదలివచ్చిరివారు । రామచంద్రు
నివెనుక । రథముతోనేగిరీ । యీలాగుపురజనులు । కోలాహలముసే
య । శ్రీరాముడదిజూచి । చింతించెనప్పుడూ । వీరంతరిప్పుడు వెంటబ
డివచ్చిరీ । వీరినిబోధించి । వారింపరాదనుచు పురజనంబులబిల్చి ।
ఆదరంబునబల్కె । యీరాత్రియిచ్చటను యిరవుగానిద్రించి । తె
ల్లవారినవెనుక । తేరుదోలింతాము । గావునసుమ్మనమింక కలశినిద్రిం
తము । అనిరామచంద్రుండు । ఆదరంబునబల్క । ఆమాటలకువారు ।
అనందమొందుచూ । గాఢంబుగావారు కనుమూసినిద్రింప । ఆరామ
లక్ష్మణులు అర్ధరాత్రినిలేచి । రథముతోలించిరి । రాజమార్గముతప్ప
పౌరులెరుగకయుండ । మారుమార్గముబట్టి । గంగాతటముజేరి । ఘన
సూతుతోననిరి । యికరథముదోలుకుని । యింటికినిపొమ్మనిరి । అ

చటమునివేషములు । అమరంగదాల్చిరి। తిరుమణినామములు। తీరుగాదిద్దిరి । గుహుడురాములజూచి కుతుకంబుతో మ్రొక్కి । నావపైనిడుకుని భావించిపూజించె । కడుభక్తిజూపుచును । గంగనుదాటించె । అంతటభరద్వాజు । ఆశ్రమముజేరిరి । ఆభరద్వాజముని ఆరాజమానలకు । ఆదరంబొప్పగా । అతిథిపూజలుజేసె । చిత్రకూటమువిూరుచేరియుండుడటంచు । మార్గంబుజూపింప ॥ మహితశిష్యులబంపె । చిత్రకూటముజేరి , చిత్రిశాలన్సృజంచి । సీతాసమేతులై । ప్రీతితోనుండిరి । అచ్చటనుసూతుండు । అయోధ్యకరుదెంచి । దశరథునకుదెల్ప । దరిలేనిశోకమున స్వర్గపురమునుజెంద । సర్వంబుదుఃఖించె । అప్పుడు వశిష్టుండు అతనిమంత్రులతోడ । భరతుణ్నిబిల్పించి । పైతృకముజేయించె । భరతుడప్పుడుతానుపట్టాభిషేకంబు । అంగీకరించకా అతిదుఃఖమునబలికె । రామచంద్రుడులేని రాజ్యంబునాకేల । అనివిరక్తినిబొంది అయోధ్యనుండకను । నారచీరలుజడలు । నయముగాధరియించి, చిత్రకూటాద్రికి । చింతతోనేతెంచి అన్నకూనతిభక్తి । ఖిన్నుడై వలగొని । సాష్టాంగముగమ్రొక్కి । జనకజాతునుమ్రొక్కి । తమ్మునిలక్ష్మణుని తాకౌగలించుకుని , వారితోనప్పుడు వారకనిట్లనెను । రామచంద్రమహాత్మ రాజీవదళనేత్రి । మనతండ్రిదశరథుడు మరణంబునొందెనుమి । అనిజెప్పిభరతుండు అతిదీనుడయియుండ । ఆమాటలనువినియు రాముడులక్ష్మణుడు । రమణసీతాదేవి అమలుఃలాముగ్గురూ । అతిదుఃఖమునుబొంది గంగానదికేగి । స్నానముల్గావించి । కృత్యముల్దీర్చిరి । తమ్ముడాసివేగి । తప్పకరాజ్యంబు । పాలింపుమనతను । పరమభక్తుండగుచు । అన్నరాఘవులకు । అతిభక్తితోమ్రొక్కి , పాదుకలిమ్మని । వడితోనబుచ్చుకొని పైధూళిబడకుండ । పీతాంబరంగప్పి కనకపేటికయందు । కాకుస్థపదముంచె శిరమందుపెట్టుంచి , శీఘ్రంబుగావచ్చె అయోధ్యకేగక । ఋషివేషధారియై నందిగ్రామములోన । పొందుగావసియించి రాముపాదుకలనే । రాజుగానొనరించి సింహాసనముసందు । చెలువముగనడియుంచి రాజ్యంబుసేయుచును ।

రాముపాదుకలకు । భృత్యుడై భరతుండు సత్యరతుండగుచు । యెప్ప
టికృత్యముల్ తప్పకనప్పుడే । రాముపాదుకలకు ప్రేమమీరంగనంత ।
చేతులుజోడించి, జెప్పుచునుండెనూ । శ్రీరామలక్ష్మణులు సీతాసమేతు
లై । జనస్థానమునందు చక్కగానుండగా । విరాధుడనియేటి వికృతా
రాక్షసుడు । చేరువకునే తెంచి । సీతనుమ్రింగబోవ, రాముడారాక్షసుని
రయమునసుకడ తేర్చె । అంతనారాక్షసుడు । ఆరూపమునువిడచి దివ్య
రూపముదాల్చి । మార్గంబుజెప్పగా మహికినేగుదెంచి అత్రిమునీశ్వ
రు ఆశ్రమముకొచ్చిరీ । ఆమునియుపూజింప అలరిరిముగ్గురూ ! అన
సూయసీతకు అంగరాగములిచ్చె । అంతటమువ్వురూ । సంతోషచి
త్తులయి శరభంగమునిగాంచి । సరగునమ్రొక్కిరీ ఆశరభంగునిచె। ఆ
ద్రుతులయియేగి అగస్త్యమునినాథు । ఆశ్రమంబునకేగి అతిభక్తితో
మ్రొక్కి । ఆమునిచేతను । పూజింపబడివారు । పొలుపుమీరగవచ్చి
సుతీక్ష్ణమునియొక్క । సుకుచిరాశ్రమమునకు । చయ్యనవేంచేసి । సర
గుననామునికిమ్రొక్కి । యామునిచేత పూజితులయిపోయి । జనస్థాన
మును జేరి । ఘనమోదమునమీరి । పర్ణశాలొక్కటి । బాగుగాచేసుకో
ని । అందులోముగ్గురూ అతిమోదముననుండి । వేడుకమీరగా । విహా
రింపుచుండగా । పరమమోదంబునా । పర్ణశాలావద్ద । సీతామహాదేవి
చెలగుచునప్పుడూ మామిడిమొక్కలను । ప్రేమబెంచుచునుండె । అం
తటశూర్పణఖ । అక్కడికివచ్చెను ! రామసౌందర్యంబు । రక్కసియు
జూచెను । శ్రీరామచంద్రులను । చేరివరించుమని । సీతనాకుండగా। చె
లువలింకేలనే । లక్ష్మణులకునీవు , రమణివిగిమ్మనెను । సౌమిత్రిధరిజే
రి । ప్రేమవరియించుమని । నీచక్కదనమునకు । నేతగూవాడనే । రా
మచంద్రులకునే । రమణిదాసుడనేను । నాకుదాసివైయైన । నీకేమిగౌర
వము । రాముడేతగునీకు । రామవరించుమీ । ఆరాముదరిజేరి । అబల
యాసీతేల । దానిమ్రింగెదనంచు । దరిజేరగాజూచి , జానకిఝడియం
గ । సౌమిత్రిపరుగెత్తి రక్కసినీపట్టి। ముక్కుచెవులనుగోసె । గార్ధభ
స్వరముతో । ఖరదూషణులజేరి । ముందరనుబడియేడ్చె । మొత్తుకో

నుచునుజెప్పె । దశరథతనయులు । తరుణితోడనువచ్చి । పంచవటినీ జే
రి । పర్ణశాలగట్టి । భయములేకుండిరీ । వారిజూడనుబోవ । అడ
దియనకను । అడిదంబుచేబూని । వారుయింతజేసిరినన్ను । యింకమీా
పణమేల । ఆమాటవిన్నంత । అదిరిపడిభ్రాతుల్లు । ఖరదూషణాదు
లు । కనులనిప్పులురాల్చి । మానవాధములకును , మదమింతయెక్కనే
పదముంచునీవనుచు । పదునాల్గువేలతో । భీకరధ్వనులతో , పిశితాశ
నులురాగ । రాముడంతటజూచి । రమణిగుహలోనుంచి । సౌమిత్రికా
పుంచి । సాధనంబులుబూని । నిలచినరక్కసుల్ । నెరపిరిబాణముల్
రాముడుపదునాల్గు । రక్షస్సహస్రముల్ । అరజాములోపలను । అం
దరనువధియించె । హతశేషరాక్షసుల్ । అడవులకుపారిరి । అంతటశూ
ర్పనఖ । అతివేగమునబోయి । రావణాసురునెదుట । రాక్షసులదరిపడ
నెత్తియునేలపై । మొత్తుకొనిపడ్డను । యింతయెవ్వరుజేసె । యిం
తివేగముదెల్పు । యనుచురావణుడడుగ ! అంతవివరముదెల్పె । రామ
లక్ష్మణులనుచు । రమణిసీతాదేవి రశరథతనయులు । తరుణితోడనువచ్చి
ఖరదూషణాదులను । ఖండించెనందొకడు । నాముక్కుచెవులను , నా
తియనకనొకండు । పట్టితెగకోసెను । బ్రతుకేలనాకింక । అనిదెల్పరా
వణుడు । హాహాయనుచుబల్కె । చెల్లెలానిన్నిట్లు । చేసినామనుజనీ
మనుజాధములకింత । మదమెక్కువాయనే నాబలంబునుజూపి । నీబన్న
మునుదీర్తు । వారిసంగతినాకు వత్తిచెప్పుమనంగ । వారిసామర్థ్యంబు
వర్ణింపలేనయ్య । కాంతరూపముజెప్ప । ధాతకైనవశంబె । మూడు
లోకములందు । ముదితబోలగలేరు । అనిబల్కరావణుడు । అతిమో
హితుండయ్యె । మగువతెచ్చెదనంచు । మారీచుదరిజేరి । మనజనస్థాన
మున । మనుజాధములువచ్చి । మగువతోగూడుకొని । రామలక్ష్మణుల
నుచు । రమణతోనుండిరి నాయనుజశూర్పనఖ । నాతియనకనువారు
ముక్కుచెవులనుగోసి । మొరడుగాజేసిరీ । ఖరదూషణాదులను । ఖం
డించిరనివింటి । కడుపరాభవమయ్యె । వారివంచనజేసివనితనుగొని తె
త్తు । నీసహాయముగోరి । నీకడకువచ్చితిని । ఆమాటలకువాడు । అడ

లుచునుబల్కెను ॥ వారితోమనకెప్పుడు । వైరంబువద్దుసుమి । కౌశికు
యజ్ఞంబు । కడగివిఘ్నముసేయ । ఒక్కశరంబునా । ఉదధిపడగొట్టె ఆ
ప్పటినుండియును । హడలిపోవుచునుంటి । తపసినై యుంటినే । దండం
బుబెట్టెదను । అనవినిరావణుడు । అతికోపమునబల్కె । ననువధించెద
నన్న నీచిత్తమనిమ్రొక్కి । వీనిచేహతమయిన । విపులనరకముగల్గు । ఆ
రాముచేబడిన । హరిపదంబగునంచు । చిత్రసారంగమయి । సీతముంద
రనిలచి । చెలగితిరుగుచునుండ । సీతమోహముజెంది । పతిజూచియా
సీత । పట్టితెమ్మనికోరె । రాముడామృగముతో । ప్రేమబట్టగబోయె
అందినట్లుండుచును । అతిదూరమునకేగె । మాయలేడిదియనుచు । మా
రీచువధియించె । హాలక్ష్మణాయనుచు । అఱ్ఱచనవినిసీత । భయమందిల
క్ష్మణుతో । అన్నజూడగబొమ్ము । అసురులచేకూలెనో । ఆర్తస్వరము
వింటి । భయమేమిలేదమ్మ । భద్రాద్రిరాములకు । చింతలునులేవమ్మ
శ్రీరామచంద్రులకు । అనరానిమాట్లాడ । అవనిజయాడంగ । వనదేవత
లనాజ్ఞ । చుట్టుసత్యంబెట్టి । పదుగిరులేగిసి । విల్లుచేతనుబూని । విపినం
బులకునేగె । అంతటారావణుడు । భూసురవేషంబూని । భిక్షనిండవిభూ
తివ్రెప్పగాతాబూసి । రుద్రాక్షపేరులు । రూఢిగాధరియించి । మౌని
వేషముదాల్చి । మౌనంబుతోవచ్చి । ముష్టిబెట్టుమని । ముదితనూగా
నిపోయె । పోవుచుండగసీత । భోరునామొరబెట్టె । దశరథునికోడలను
దగురాముభార్యను । అనరానిమాటలు । అట్టెలక్ష్మణునంటి । ఆపాపఫ
లమునకు । అనుభవంబిపుడయ్యె । జనులారసురలార । జాలిపడిబ్రోవు
డీ ॥ అనుచుమొఱ్ఱలుబెట్ట । అదిజటాయువువిని । అడ్డుపడిహతుడయ్యె
ఆకాశమార్గమున ॥ ఆరథమేగుచో । ఋశ్యమూకాద్రిపై । యింతిక
పులనుజూచి । చిత్రభూషణములు । చీరచెంగునకట్టి । సుదతివిడువగప
డెను । సుగ్రీవుసన్నిధిని । అటుమీదరావణుడు । ఆలంకనూచేరి । అశో
కవనాక్రింద । అవనిజానుంచెను । శ్రీరామలక్ష్మణులు । శీఘ్రింబుయెదురు
కుని తమ్ముడాలక్ష్మణా । తరుణినొక్కతెవిడచి । తరలియిటురాదగునా అ
నుజుడన్నతోబల్కె । భూదేవికూతురు । బుద్ధిహీనతవార్త । పతిభ్రా

తు౯లిద్దరూ । పర్ణశాలకుజేరి । పద్మాక్షినెదుకంగ । సీతకనుపడకున్న చింతతోవెదకుచు । చెట్టుపుట్టలుదిరిగి । సీతజూసి, రెమిూరు । అనిచెట్ల నడుగుచును । అటజటాయువుగనిరి । వీడురాక్షసుడేను । వీనికొట్టెదన న్న । వినివాడుచింతించి । రామసీజనకునకు । పే౯మమిత్రుడనగుట। రా వణుడుసీసతిని । రథికుడై గొనిపోవ । అడ్డుపడియిట్లయితి । అనిపక్షిరాజ ప్పుడు । అసువులువదలంగ । అతనిముక్తునిజేసి । అచ్చటనుండేగి । ఖలు కబంధునిబట్టి । ఖండించితలనుంచి । శబరివనములకేగి ॥ సంపూజితుం డయ్యె । జానకీవృత్తాంబు సర్వంబుదెలసుకుని । దశకంఠుడాసీత । తనలం కలోబెట్టె । ముందుపంపానదసి । ముదమారగనిపించు । అచటసుగీ౯ వుండు । అన్నతోకలహించి । అది౯పై నుండెను । అతనుమిూకార్యం బు । అంతయుసమకూర్చు । అనిచెప్పియాశబరి । తనదేహమునువిడచి రామునికరుణచే । బ్రహ్మపదమునుబొందె । అమిూదరాఘవులు ఆపం పదరిజేరి । దానిశృంగారంబు । ధరివనంబులుజూచి । ఇట్టిశృంగారం బు । యెన్నడై నెరుగుదుమె । యీసమయముననాకు । ఇంతిలేదాయెనే యీపక్షికలరవము । యీమలయమారుతము । పంకజంబులమిూద భ్రమరగానంబులూ । కోకిలారావముల్ । కోమలినెడబాయ । మడు గులోపుష్పముల్ । మదనబాణములయ్యె । సీతగానకయున్న । చిత్త మెట్లుగనిలచు । నీలోత్పలంబులూ నెలతకన్నులబోలు । యీచకి౯వా కముల్ । యీపద్మముకురముల్ । ఇంతికుచములబోలి । యింపాకుచుం డెనె । ఈహంసనడకలు । యింతినడకలుబోలె । చారుశైవాలంబు సీతకురులనుబోలె । కూర్మరూపంబులూ । కోమలిపాదములె । మిూను లకిలకలు । మెలతచూపులబోలె । ఆవర్తమునుజూడ । అతివనాభిని బోలె । పంకజంబులుజూడ । పణతివదనంబాయె । యీవనంబునుజూ డ । యింతినేదోపించె । మల్లెమొగ్గలుజూడ । మగువపలువరుసాయె చిలుకపలుకులువినిన । చెలువమాటగదోచె । కోకిలారావముల్ । కో మలిగీతముల్ । దొండపండునుజూడ । తొయ్యలిమోవయ్యె । వదిమా చిననాకు । యింతిరూపంబయ్యె । అనుచుదుఃఖంపగా । సౌమిత్రిబో

ధించె। రాముసూరడబల్కె। సీతోపచారముల్ । చేసెనూస్వామితిరి
యంతధైర్యమునొంది। ఆసరస్సునమునిగి। స్నానసంధ్యలుదీర్చి। జల
ముపానముజేసి। విల్లంబులనుబూని। ఋశ్యమూకముదరిని। వచ్చు
చుండగజూచి। వారెవ్వరోయనుచు। అపుడుసుగ్రీవుండు। అంజనే
యునిబిలచి। వటురూపమునుదాల్చి। వారిసన్నిధిజేరి। యింగితంబు
నుమాకు। ఈగడసూచింపు। వాలికింకరులయిన। వారిపోవుదమనెను
వాయుపుత్రుండపుడు। వటురూపమునుదాల్చి। వారిసన్నిధిజేరి।
వందనంబులుజేసి। యెవరుమీరనియడుగ। ఇనవంశజులమనిరి। మీ
దేశమేదనిన। మాదయోధ్యాపురము। యిటకేలవచ్చితిరి। యింతివె
దకుటకనిన। తండ్రిపేరేమనిన। దశరదాధిపుడనిరి। అంతనిశ్చయమ
నుచు। ఆత్మలోపలనమ్మి। అపుడుసుగ్రీవుండు। కపిరాజుమాకుపతి।
వాలితమ్ముండతడు। ఆలినిగోల్పోయి। అద్రిపైనివసించె। మీరిద్ద
రునుమైత్రి। మెలగినమేలగును। అనివేడుకొనివారి। వెనువెంటగొ
నివచ్చి। అర్ఘ్యపాద్యాదులను। అతిభక్తితోనిచ్చి। సుగ్రీవుడప్పు
డు। శుభమయ్యెమనకనుచు। రాముతోతనబాధ। పేరిమబుట్టగదె
ల్పె। అపుడురాముడుబల్కె। ఆవాలివధియించి। అతనిరాజ్యమునీ
కు। అధిపుగానినుజేతు। అనినసుగ్రీవుండు। ఆరాముతోబల్కె। వా
లివధింపగా। పరమేశునకుతరమె। అనినరాముండపుడు। అతనినమ్మిం
పగా। యేడుసాలములను। ఏకశరమునదుంచె। నమ్మిసుగ్రీవుండు
నరనాథుతోబల్కె। స్వామినీకార్యంబు। చక్కబెట్టెదననెను। అనివ
నిద్దరునపుడు। అగ్నిసాక్షికముగా। శపథంబుచేసుకుని। సీతవిడిచినన
గలుశ్రీరామునకుజూపె। అవిజూచిరాముండు। అక్కునజేర్చుకుని।
ఆభరణములుమీరు। ఆసీతవిడచిరె। అనుచుముఖమునజేర్చి। అతి
దుఃఖమునబొందె। సుగ్రీవలక్ష్మణులు। శుభ్రితులచేబోధింప। అపుడు
రాముడులేచి। విపులధయిర్యముబూని। వానరేశ్వరనీవు। వాలితో
పోరాడ। ఆసమయముననేను। ఆవాలిద్రుంచెదను। అనినపరుగునబో
యి। ఆవాలితోపోర। చెట్టుచాటునుంచి। చాపంబుసంధింప। అన్న

దమ్ములపోల్కి । యెంచతరమూగాక । బాణమేయకనిల్వె । కనికరం
బూలేక । కపిరాజుతమ్ముణ్ని । కఠినబాణంబులా । కష్టఘాతలుజేయా।
గిరుప్రినసుమళ్ళియు । గిరిపైకిజేరంగ । రాముడంతటవెళ్ళ । వపినుతు
దుతాజూచి । మోసంబుజేసితివి । వ్రాసూర్యవంశజా । నీవల్లగాదని
యు । మున్నెజెప్పితెపోన । వ్రాయికపిశేఖరుడా । వ్రెప్పగావినవయ్యా
మీరూపములురెండు । ఏకరూపమునుండ । యెంచనలవిగాక । పొంచి
యూరాశంటి । యీపూలహారంబు । కంఠమునధరియించి । రేపయి
నయుద్ధంబు । ఓపికతోజేయుమీ । శ్రీదేవితోడుసుమి ! శీఘ్రముగవ
ధియింతు । అపుమాటలువిని । అన్నన్నగుహాకడకు । అనుజుండుతా
బోయి । ఆజికీరమ్మనిన । ప్రియక్రోపంబున । ప్లవగపుంగవునపుడు ।
తూణీరములుబూని । దురితంబుగారాగ । తారయడ్డమువచ్చి । తన
నాధుచెయిబట్టి । నాథతఁాప్రిణేశ । నామనవివినవయ్యా । తాటకాం
తకుడయిన । దశరథానందనుడు । రాజఅనుమతిమీద । రాక్షసులజం
పుటకు । భూమిపరిపాలనకు । భూరిప్రితాపుండు । కిష్కింధకూవచ్చి ।
కపిరాజుతోసంధి । కడునొప్పగాజేసె । సమరంబునకుబోను । క్షమయం
బుగాదనిన । కలకలమనినవ్వి । కపిరాజుసతిజూచి । వైరుండుబిలువంగ
యేగకనునిల్చుటా । వీరధర్మముగాదు । వాడిగలవీరుణ్ని । వనితకో
భయమేమి । సఖయబోయెదననీ । సమ్మతీదగజేసి । అనుజుతోపోరంగ ।
ఆరాఘవులుజూచి । చెట్టుచాటూనుంచి । శితశరంబునువేసి । వాలినిప
డగొట్ట । వాలిరామునిజూచి । వసుధేశునిందించె । అన్యాయముగన
న్ను । హాతముగావించితివి । అనినవాలితోబల్కె । అనుజుపారగగొట్టి
అతనిసతిగూడితివి । పాపాత్ముడవుగాన । పట్టివధియించితిని । అనినరా
మునిజూచి । అతిభక్తివినుతించె । సుగ్రీవునకునపుడు । పట్నంబుగట్టిం
చి । ప్రతిననిల్పినయంత । వర్షకాలమురాగ । పర్వతగుహాజేరి । ఆరా
ముడాత్మలో । యవనిజాతనుదలచి । చాలదుఃఖముజెంద । సౌమిత్రి
యోదార్చి। వర్షకాలముబోవ వచ్చిసుగ్రీవుండు । వసుధాత్మజనువెదు
క । వానరులనూపంపె । వారుభూలోకమును । వరుసగావెదు

కుచును । అడవులనదులను , వారంతటను వెదకి , వనితకను
పించకను , అప్పుడుమహేంద్రాద్రి , అంగదాదులు వెదకి । దక్షిణాబ్ధిని
జేరి । దాటలేకుండిరి , సందేహమునుబొంది । మనకునుగ్రీవుండు। మా
నమువధనిజెప్పె । అదియంతగడచెను । అదిదాటగాలేము ! సీతజూడక
మనము । కిష్కింధచేరితే । వార్ధిదాటియుమమ్ము । అందరనువధియిం
చు । యాజటాయువుమున్ను । యారాముభక్తుడై । దేహంబుచాలించి।
దివ్యపదమునుజెంజె , మనకువ్యర్థముగాను । మరణంబునిజమిపుడు ।
ప్రాయోపవేశనము । పరగంగజేసిరి । యాజటాయువుమాట । అద్రిగు
హాలోనుండి । సంపాతియనుపక్షి । చల్లచల్లగవచ్చి । వినివచ్చివారిగని ,
ఘనులుమీరెవ్వరో , యాజటాయువునాకు । అనుజుండువానికిథ । యే
మొయనుచుంటిరి , యింపుగాజెప్పుమన , రావణుండనువాడు , రాము
భార్యనుగొంచు । పోవుచోనడ్డమై । పొలిసెనువానిచే , అపుడురాముం
డొచ్చి , అతనికిముక్తిచ్చె । యనినదుఃఖముజెంది । యాకపులతోబల్కె
యాసీతలంకలో । యశోకవనాకిింద , యవనిజాయున్నది । య
దలకుమనిదెల్పి । యందరనుబ్రతికించె । అపుడు హనుమం
తుండు । ఆరాములకుమొక్కి । విపులదేహముదాల్చి , వి
ష్ణుపదమునకెగసి । వేగబోవుచునుండ । వేల్పులుబంపగా । సు
రసయడ్డమువచ్చి । చూడబ్రమింగెదనన్న । సూక్ష్మరూపముదాల్చి
నురసగర్భముజొచ్చి । వెలికివెంటనెరాగ । విజయమగునీకనెను।
అతివేగమునబోయి । ఆలంకజేరెను । ఆరాత్రిలంకలో , అరయ
బోవుచునుండ ! లంకిణియడ్డమై । హుంకంబుజూపింప , వకగుద్దు
చేదాని । వసుధపైబడగొట్టె । లంకాపురమువెదుక । లలనగనుపిం
పకను । సూక్ష్మరూపముదాల్చి । సుదతులందరువెదకి । రాక్ష
సాంగనలంను । రమణిగనుపడకుండె । పానశాలలుదిరిగి । వణతి
నంమునవెదకి । అంతఃపురముజేరి । అచటపుష్పకమెక్కి । రావ
ణాశయ్యపై । రమణులందరలోను । అమితరూపముగల్గి । ఆరా
వణునివద్ద । ఆలింగితాంగియై । అతిసౌఖ్యనిదరగొని । పవళించియు

న్నట్టి । పణతిమండోదరిని । గనిసీతయిదియనుచు । కరమువిచా
రించి । సీతామహాదేవి । శ్రీరామునకుపత్ని । యీనీచుశయ్యపై
యీరీతినుండునె । నాకిట్టిభ్రాంతేల । నాతివెదకెదనింక । అనుచు
వనములువెదకి । అటయశోకవనంబు । అరసివెదకుచురాగ । శింశు
పాతరుమూల । సీతమధ్యనునునిచి । రాక్షసస్త్రీగణము । రమణి
చుట్టునునుండ । రామరామాయనుచు । రామునితలచుచును । క్రూర
మృగములమధ్య । కురరిలేడినిబోలి । అడలుచునుదుఃఖించె । అది
సీతయనిదలచి । ఆసమీపముజేరి । ఆతరువుపైనెక్కె । అప్పు
డారావణుడు । అతికాముకుండగుచు । యువనిజనునొప్పింప । అతి
వలతోవచ్చి । కరదీపములుమెరయ । కనుగొనిజానకిని । కాంత
నన్నేలుమీ । కామబాధంబకితి । కన్నెత్తిచూడుమీ । కాంతనీ
వాడనే । దేవాసురులునన్ను । తేరిజూడగలేరు । రాముండుమానవు
డు । రమణినన్గెల్చునే । తండ్రియడవికిద్రోయ । తపసివైతిరుగునే
బీదవానికినీవు। ప్రియురాలవగుదువే। తివిరిజయింతురా । నారాజ్యమంత
యును । నాతినీవేలుమీ । నాకాంతలందరును । నీకుబానిసలగును ।
నావైభవంబంత । నీవైభవంబునుమి । ఆమాటలనువినక । ఆననము
వంచుకుని । ఉరమందుజానువులు । ఘెప్పుగాజేస్కొని ॥ తృణముమ
ధ్యనుపెట్టి । తులువతనమింతేల । బలముగలవాడనని । పరకాంతదెత్తు
రే । చోరవృత్తిగనీవు । శునకంబురీతిగా । నాథుడెరుగకయుండ । న
న్నుగొనివచ్చితివి । పరకాంతలనుగోర । భస్మమైపోయెదవు । ఆ
రామలక్ష్మణులు । అతిపౌరుషులువారు । ఖరదూషణాదులను ।
ఖండించిరెరుగవె । పరశురామునిబట్టి । భంగంబుజేసిరీ । పుత్రపౌ
త్రాదులతో । పొలియించుదురునిన్ను । అనిసీతబలుకగా । అతికో
పమునమండి । దనుజకాంతలజూచి । దర్పంబుతో బల్కె । శీఘ్రముం
బుగామీరు । సీతనొప్పింపుడీ । ఒప్పకున్ననుమీరు । చప్పలించుడ
టంచు । కత్తిచేనరకబో । గడగడనువణకంగ । వానికాంతయొకతె ।
వానిచెయిబట్టుకొని । దేవదానవసతుల్ । వేవేలుయుండగా । మానవాం

గనయేల । మగువలింతులు లేరె । దీనిపై బ్రేమంత । నీదేవిపయినుంచు । దీనిసాటిగజూచి । దేవాంగనలపొందు । అనుచుమళ్ళింపగా । ఆరావణుడుజనెను । కాపున్నకామినుల్ । కడగిసీతనుజూచి । పంక్తికంఠునినీవు । వరియించకుండినను । భక్షింతుననెనొకతె । శిక్షింతుననెనొకతె । నవ్వులుదుననెయొకతె । నరుకుదుననెయొకతె । అందరును యీరీతి । ఆసీతబెదిరింప । త్రిజటయనుయొకయింతి । తీరుగామేల్కాని । యీసీతదగ్గరకు । యికమీరుపోవద్దు । నాకుస్వప్నంబయ్యె । మీకుదెల్పెదవినుడు । శ్రీరామలక్ష్మణులు । చిరునవ్వునవ్వుచును । ఏనుగాపైనెక్కి । యీలంకలోజొచ్చి । సీతనెక్కించుకుని । శీఘ్రముగజనినట్లు । రాక్షసేశ్వరుడపుడు । రాసభముపయినెక్కి । దక్షిణముఖముగా । దరలినట్లుగగంటి । సీతతోమనమింక । స్నేహముగనుండవలె అనిదెల్పభయమంది । అందరునునిద్రింప । అంతటాజానకియు । అతిదుఃఖమునుబొంది । యిన్నిబాధలుపడుచు । ఇంకబ్రతుకగనేల విడుతుప్రాణములనుచు । వేణికొమ్మనుజుట్ట । అంతటమారుతియు । ఆకులలోడాగి । ఆరావణుడువచ్చి । ఆడినమాటలను । వినియునూరకయుండె । వేళగాదిదియనుచు । యిపుడుదెలుపకయున్న । యింతిప్రాణమువిడుచు । కపిరాజుమముబట్టి । ఖండించునీక్షణము । రాఘవులయత్నంబు । మోసమయిపోవునని । దశరథాతనయులు । తరుణితోగూడుకుని । పంచవటినిజేరి । పర్ణశాలనుయుండి । ఖరదూషణాదులను । ఖండించివైచిరి । శ్రీరామలక్ష్మణులు । సీతనుగోల్పోయి । ఆతన్వివెదకుచును । అడవులన్నియుదిరిగి । సుగ్రీవుసన్నిధిని । సుఖముగానుండిరి । అనిసీతవినునట్లు । అందరునువినకుండ । పలికినవినిసీత । భయముతోమదిదలచె । పలువిధంబులనన్ను । భ్రమియింపజేసెదరు । అనుచువయినముదలచి । ఆతఁడాబొంకుచుబల్కె । యీయమృతవాక్యంబు । యెదురబడిచెప్పుమన । కడుసూక్ష్మరూపుడై । కాంతదగ్గిరజేరి । రామువృత్తముదెల్ప । రాక్షసుండేమొయని । భయపడుచుండగా । రామునిచరితంబు । రమణితోడనుచెప్పి । అంగుళీయక

మపుడు । ఆసీతకందిచ్చె । అదిజూచియాసీత । అక్కునను జేర్చుకొని రామనామముజూచి । రమణికన్నులనద్ది । ముద్దుపెట్టుకుదాని । ము దమారజూచుచును । శిరముపైనుంచుకొని । శ్రీరామ రామయని । రాముజూచినయట్లు । రమణిమోదించుచును । ఆరాము వృత్తాంబు అంత దెలియగవినుచు । ఆంజనేయాసీవు । అతిభక్తుడవుమాకు । నా ప్రాణములనిచ్చి । నన్ను రక్షించితివి । నీయుపకారంబు । నేమరువ లేనయ్య । శ్రీరాములిచ్చటకు । యేరీతిగావచ్చు । అనియడుగమా రుతియు । ఆసీతతో దెల్పె । రామలక్ష్మణులనే । నామీదనెత్తుకొని। అబ్ధిదాటించుకొని । అతివేగమున తెత్తు । అనిననీదేహంబు ॥ అల్ప మాత్రంబయ్యె । యెట్లుదెచ్చెదవన్న । యిపుడునాదేహంబు । చూ డుమనిపెంచగా । సుదతిచూడగజడసి । చాలువద్దనిచెప్ప । బాల రూపముధాల్చె । అపుడుజానకిబల్కె । ఆరాముతో చెప్పి । వాన రాసేనలతో । వానరాధిపుగూడి । సాగరంబునుగట్టి । వేగంబుగావ చ్చి । రావణాసురుబట్టి । రణమునను నిర్జించి । పుత్రపౌత్రాదిగా । మిత్రబాంధవులతో । భస్మంబుగావించి । వణతిననుగొనుమనుమి ఆమాటవినికపియు । ఆసీతతోబల్కె । నిన్నుజూచితినన్న । నన్ను నమ్మగనిపుడు । తగినగురుతిమ్మనిన । తనశిరోమణియిచ్చి । కాకాసు రునిముక్కు । కరుణించుకథదెల్పి । మాసద్వయముదాక । మహిజ యొడబడకున్న । చంపుమనెరావణుడు । ఆమాటరాముతో , అధి కంబుగాదెల్పు । యింతలోరాఘవులు । యిచ్చటకురాకున్న । సీ తప్రాణమువిడచు । శ్రీరామయనిదెల్పు । అనగవినిమారుతియు । అవనిజాతకుమ్రొక్కి । శెలవిమ్ముదేవియని । చేతులుముకుళించి । వలగొనియాసీత । వనచరుండునుగోరె । వనములోపలనున్న । ఫల మొకటిశెలవిమ్ము । అనియడుగజానకియు । అతికష్టమునమెప్పె । అసు రులచేనెపుడు । అపజయములేకుండ । ఆశీర్వదించియును । అరు గుమనగావచ్చి । ఆయశోకవనంబు । ఫలములన్నియుదినుచు । ప ల్లవంబులువిరచి । పక్షులనుబెదరించి , పట్టికొమ్మలువిరచి । వృక్షం

బులన్నిటికి । పీతశాఖలుజేసి । ధరణిజాయున్నట్టి । ధరణిజాతము
విడచి । శింశుపావనమంత । చెలిపివేయగజూచి । వనపాలులందరు
వాయుపుత్రునిజేరి । కొట్టబోయినవారి । కొట్టిలోకనుజుట్టి । హ
తముజేయుచునుండ । హతశేషులరుదెంచి । పంక్తికంఠునిలేపి ।
వడవడవణకుచును । వానిపదములమ్రొక్కి । యింతభయమేలన ।
యేముచెప్పెదవిక । కోతివకటివచ్చి । సీతతోమాట్లాడి । శింశు
పావనమంత । ఛేదించివేసెను । అడ్డమేగినమమ్ము । హతముగా
వించెను । హతశేషులముమేము । బ్రతికివచ్చితిమనిన । క్రోధతా
మ్రాక్షుడై । కోతింతకొరివ్వనే । పంచెసేనాగ్రణుల । పట్టుడని
పంపెను । వాయుసూనుండపుడు । వారితోపోరాడి । నఖదంతవా
లముల । నాల్గులక్షలద్రుంచె । హతశేషులేతెంచి । అతిభీతితోదె
ల్ప । జంబుమాలినిబంపె । వారుసేనలతోను । వచ్చుచుండగజూచి
యినుపదూలమువలెను । యింపుగానిలచె । ఆరాక్షసుడువచ్చి ।
అంపవానలుగురిసె । హనుమంతునప్పుడు । ఆయసస్తంభమున । అం
దరవధియింప । అక్షకుమారుండు । హనుమంతుగెల్తునని । అధికసేన
తోరాగ । తోరణస్తంభమున । తోకయాడించుచును । తోకద్రి
ప్పుచునుండి । అక్షకుమారుండు । అస్త్రజాలముబరప । స్తంభంబు
పైనుండి । సేనలోపలకురికి । కాళ్ళతోతన్నుచును । గోళ్ళతోజీరి ।
తోకతోనణచుచును । దుమ్ముధూళిగచేసె । అక్షరాక్షసుడపుడు ।
హనుమంతునెదురుకొని । కోతిచేష్టలుచేసి । కొమ్మలునువిరచితివి ।
నినువధించెదనిపుడు । సిలుముపరుగెత్తకను । క్రూరబాణంబులివి ।
కొమ్మలుగావుసుమి । అనిబల్కమారుతియు । అక్షుతోనిట్లనెను ।
కోతిగాడనినన్ను । కొద్దిగాజూడకుమి । నీదుబలమునుజూపి । నిలచి
పోరాడుమీ ॥ అనినరావణసుతుడు । అధికంబుగానార్చి । ఘోరా
స్త్రములుబూని । కపిపైనిగురియింప । హస్తంబులనుబట్టి । అవిఫెళ్ళ
ననువిరచి । ఆకాశమునకెగసి । అక్షశిరమునకురికి । మస్తకంబునుదు
నిమి । మరితోరణంబెక్కె । అక్షకొమరునిషథను । ఆరావణుడువిని ।

యిదియొక్కభూతమని । ఇంద్రజిత్తునుజూచి । పరుగుననునీవేగి । ప
ట్టితెమ్మంబంప । ఆమేఘనాథుండు । అరదంబుపైనెక్కి । సింహనా
దంబుతో । చేరవచ్చుటజూచి । వాలంబుద్రిప్పుచును । వతిఁఱంపు
చుండంగ । ఆమేఘనాథుండు । అయిదుబాణములచే । శిరమునవా
టింప । శీఘ్రింబుగానురికి । ఉక్కుదూలముబూని । దిక్కుల
దరగనార్చి । అశ్వసూతులతోను । అరదంబుగూల్చె । ఆయింద్రజి
త్తునూ । అన్యరథమూనెక్కి । బ్రహ్మాస్త్రమునుబోసి । బంధించెమా
రుతిని । హనుమంతుడప్పుడు । యాలోచనముచేసి । పడియుండి
యప్పుడు । పంక్తివదనునిజూచి । సంభాషణముసేయ । సమయంబు
దొరికెనని । సంతోషమునసుండి । వక్కపనికైబోయి । పెక్కుప
నులుసేయ । బుద్ధిమంతుడటంచు ॥ బుధులుచెప్పిరిగాన । వేడుకతో
నేను । వింతపనులనుచేసి । నాప్రజ్ఞచూపించి । నాపేరుదెల్పెదను ।
బ్రహ్మాస్త్రబంధుడయి । పడియున్నపట్టుకొని । మేరుశిఖరముమాట్కి
మెలగుమారుతిదెచ్చి । పలురాక్షసులుకూడి । పడపడతన్నుచును ।
మాయశోకవనంబు । మటుమాయచేసితివి । యిపుడునినుజంపితే ।
యెవరుకాతురునిన్ను । అక్షయకుమారునీ । అంతమొందించితివి । ని
న్నుజంపిననిపుడు । నిష్పాపమనితిట్టి । మరిమరితిట్టుచు । మగ్గములు
పొడుచుచు । పౌరులందరువచ్చి । పరిపరికొట్టుచు । బ్రహ్మాస్త్రమ
ప్పుడు । బ్రహ్మవరమునుదలచి । పట్టువదలినగాని । కార్యార్థ
మయియుణగె । యామేఘనాథుండు । అంజనేయునిదెచ్చి । తండ్రి
ముందరనుంచి । తగునట్లుసేయుమన । పంక్తికంఠుండపుడు । పటు
ప్రహస్తునిజూచి । కోతియెందుకువచ్చె । కోరియెవ్వరుబంపె । వన
ములన్నియుజెరిపె । వధియించెనేయక్షు । అడుగుమనిచెప్పగా ।
అడిగెప్రహస్తుండు । శ్రీరాములాబంట । సీతవెదుకగేవస్తి । చూచితి
నిశాచరమణి । చోద్యంబువినుమింక । శ్రీరామలక్ష్మణులు । సీతవెద
కుచువచ్చి । వాలినొకబాణమున । వధియించిరాజ్యంబు । సుగ్రీ
వునకునిచ్చి । సుదతివెదుకగనన్ను । పంపించగావస్తి । పణతిసీతను

జూచి । నినుజూడగాదలచి । నీవనముఛేదింప । రాక్షసార్భకులెంత
రణముసల్పగనాతో । నీవయిననాకెంత । నేనెవధియించుదును
రామాజ్ఞలేకుండె । రక్షించితినినిన్ను । అనవినిరావణుడు । అతిక్రో
ధమునబల్కె । తుచ్ఛవానరనీకు । త్రుళ్ళుపాటేమింత । వీనిచం
పుడనంగ । వినివిభీషణుడనియె । దూతలేమన్నను । దునుమాడ।
రాదండ్రు । అనివిభీషణుడన్న । యాత్మలోతలపోసి । వానరజాతము
కు । వాలాభిమానంబె । కావునవాలమున । చమురుగుడ్డబుజుట్టి । జ్వా
లతోవెలిగించి । పౌరులునుజూడంగ । పట్టణవీధులను । పట్టిత్రిప్ప
డనంగ । పలురాక్షసులబట్టి । తోకగుడ్డలుచుట్ట । తోకపెంచుచు
నుండె । పట్టణంబుననున్న । వలువలన్నియుదెచ్చి । సీతచీరయుగా
క చేలంబులన్నియును । గొనివచ్చిచుట్టగను । తనతోకముడుచుకొనె ।
చప్పట్లుగొట్టుచును । సకలవీధులద్రిప్పి । ప్రాసాదములనెక్కె । పౌ
రకాంతలుజూచి । వింతవానరుడంచు । వెకవెకనవ్విరి । హనుమంతు
డప్పుడు । అన్నియునుజూచుచును । పశ్చిమద్వారమున । బంధంబుల
నుద్రెంచి । పర్వతాకారుడయి । వరగోపురంబెక్కె । తననుకాసుకువ
చ్చు । దనుజులందరద్రుంచి । ప్రాసాదములదిరిగి ; పగులంగదన్నుచు
ను । లంకాపురంబంత । శంకలేకనుగాల్చె । అప్పుడందరుజూచి । ఆ
రావణునితిట్టి । యేలయీదుష్టుండు । లలననెందుకుదెచ్చె । కోరకం
చుదెచ్చుకుని । పురమంతకడతేర్చె । బలగర్వితుండగుచు । పరకాంత
దెత్తురే । ఆఫలంబిప్పుడె । అనుభవంబయ్యెను । అనుచుగోలలుపెట్టి।
అగ్నిపడిమండిరి । ప్రాసాదములనుంచి। ప్లవగుండుపడుచుండ। ఆసీతవిని
చాల । అడలియగ్నికిమ్రొక్కె । హనుమంతునకునపుడు ॥ అంటకుండగ
జేసి । పురదాహమునుజేసి । భూమిపుత్రికిమ్రొక్కె । రమణినాతోర
మ్మ । రాముతోగూర్చెదను । అనినజానకిపల్కె । అదిమంచిపనిగా
దు । శ్రీరామచంద్రుండు । శీఘ్రంబుకపులతో । వారధినిబంధించి ।
వచ్చిరావణుద్రుంచి । వనితననుగొనకున్న । అపకీర్తియగుననుము ।
సౌమిత్రినేనన్న । సకలదుర్భాషలకు । అనుభవించితిఫలము । అదిమ

దియుంచకను । చెప్పిచరమాన్పమను । అన్నమారుతి మొక్కి । అమ్మ
జడియకుమింక । అనిను వేలాద్రిపై । అడుగులూతగద్రొక్కి । ఆకాశ
మునకెగసి । అబ్ధిదాటియురాగ । అంగదాసులుచూచి । ముఖశోభగ
నిపెట్టి । మురసితోకలుద్రిప్పి । గంతులు వేయుచును । గగనంబునకునె
గసి । మనవాయుతనయుండు । మహీతనయగనివచ్చె । అనుచుసంభా
షింప । అంజనేయుండపుడు । అవనికియేతెంచి । అంగదాసులతో
ను । అచటజరిగినదంత । చెప్పినవినివారు । చెలగుచునేతెంచి ।
సుగ్రీవునవనమంత । సొరగొనిఫలములను । భక్షించుచుండగా ।
పరిపాలకులువచ్చి । వారింపనంగదుడు। వాయుసూనుడుగూడి। దధిము
ఖామలబట్టి । దండింపవారేగి । రామసుగ్రీవులకు । రమణొప్పగా
మొక్కి । యెన్నడుమధువనము । యీరీతిచెడలేదు । అంగదమారు
తుల్లు । అందరకుశెలపిచ్చి । అడ్డమేగినమమ్ము । అవనిపైబడద్రోసి ।
ముక్కునేలనురాచి । మోదిత్రొక్కిరిమమ్ము । అనినసుగ్రీవుండు । ఆ
నందమునుబొంది । వారుసీతనుజూచి వచ్చిరిగావునను । మనమేమనగ
రాదు । మనకుకార్యంబయ్యె । కాకున్నయీవనము । కడగిదరిజేరునరె
చూచిరిసీతనని । శుభవర్తమానంబు । రామలక్ష్మణులతో । రమణొ
ప్పగాజెప్పి । హనుమంతుడింపులో । మనసీతజూచునని । దధిముఖునీవే
గి । దనరసన్మానించి । వేగదీసుకరమ్ము । అనినదధిముఖుడేగె । రామల
క్ష్మణులపుడు । ప్రేమమోదించిరి । దధిముఖుడటకేగి । దండంబుబెట్టు
చును । వెంటబెట్టుకువారి । వేగదీసుకువచ్చె । ఆంజనేయుండంత । ధర
ణీవిభులకుమొక్కి । జూచితిసీతనని । శుభముముందుగజెప్పి । అచటి
వృత్తాంతంబు । అంతయునుదెల్పంగ । సీతయెట్లుండెనని । శ్రీరాములడు
గంగ । అపుడుమారుతిదెల్పె । అవనిజయునికంత । యేకవస్త్రయి
యుండె । ఏకజటయైయుండె । రాక్షసస్త్రీమధ్య । రామరామాయను
చు । వృకములమధ్యమున । మృగరీతిగానుండె । అశోకవనమందు ।
అలరుశింశుపతరువు । దానిమొదటుంచిరి । తనువంతశుష్కించె । మ
లిసవస్త్రముగట్టి । అచటజరిగినదంత । ఆరామునకుజెప్పి । సీతయిచ్చిన

మణి । శ్రీరామునకునిచ్చె । ముద్రికనుఅందుకుని । ముదమునను రా ముండు । అక్కునను జేర్చుకుని । అతిదీనుడయి పల్కె । యెన్ని రోజుల కు నే । నిన్ను గనుగొంటిని । అనుచునా రాముండు । దనరంగ ముద్రికను । కన్నులనద్దుకొని । ఘనమోదమును బొందె । హనుమంతుడప్పుడు । అతి భక్తితోడను । జానకీపలుకులు । సౌమిత్రితో దెల్పె । రామలక్ష్మణులపు డు । రమణిసీతనుదలచి । పల్లువిచారముబొంది । పవనాత్మజునిజూచి । నీయుపకారంబు । నేమరువలేనుసుమి । యింతకుతగినట్లు । యిలలోన లేదుసుమి । యిదియసర్వమునికు । యిచ్చెదననిపల్కె । అంజనానూతు నపుడు । ఆలింగనము జేసె । ఆపయిని రాముండు । ఆకపిరాజుతో । అ తిశోకమునబల్కె । యెప్పుడుసీతనుజూతు । యెట్లుగా జూతునో । ఇం తసాగరమూను । యెట్లుదాటగలను । ఆనినసుగ్రీవుండు । యిట్లనియె రాములతో , కపులచే వారధియు । గడియలోగట్టింతు। దశకంఠు గెల్చె దము , మదినిసందేహంబు । మానుమిా శ్రీరామా । అంతటను రాముం డు । ఆనందభరితుడయి , రవిపుత్రిమనమింక । రయముగా కపులతో లంకాపురముపైని । శంకేమియును లేక । దండువెడలుదమనుచు । రా ముండుకపులతో । పయనంబులాయెను । రావణాసురుడపుడు । రాము వృత్తాంతంబు । యెరిగిచారులు చెప్ప । యెంతయును భయమంది । మన మునను దిగులంది । మంత్రులనుగనుగొని । మరియునిట్లనిబల్కె । మం త్రులారావినుడి । మనలంకపయికిపుడు । కపులనుగూడుకొని , ఘనుడు రాముడుతాను । వారధిదరికిపుడు । వచ్చుచున్నాడటా । ఒక్క హను మంతుడే । ఉక్కునమనలంక । జొచ్చివనమూయంత । చూర్ణంబుగావిం చె । రాక్షసులనెందరిను । రయమునాగడతేర్చె । లంకిణినిమడియించి లంకాపురముగాల్చె । మనకునుజిక్కకా । మళ్ళిపోయెనువాడు । అటు వంటికోతులను । యర్బుదంబులతోడ । వారాసివడిదాటి । వడివచ్చు చున్నాడు । ఏరీతిగా నేను । ఆరాముగెలుతునో । ఆలోచనలుజేసి । అతివేగ దెల్పుడన । ఆమంత్రులిట్లనిరి । అసురేశవినవయ్య । తగసము

ద్రంబును । దాటకముందుగా । సన్నద్ధులయిమనము । చయ్యనవారల
ను । చంపివేయుటమేలు । అవలీలగామూడు ! భువనముల్గెలచితివి బల
వతులనిర్జించి । దిట్టవయియుంటివి । ఇంద్రజిత్తుండగా । యింతగారఘు
డువేల । నరవానరులమేము । నమ్ముముగూల్తుము । శెలవిమ్మనుచును
న్న । సర్వధర్మజ్ఞుండు । సరవివిభీషణుడు । సరసముగనన్నతో । అన్న
రావణవినుము । ఆరామచంద్రుండు । మనుజమాత్రుండనుచు । మన
ముననెంచకుమి । పన్నగశయనుండు । నిన్నుజంపుటకునై । నరరూప
మునుదాల్చె । ధరణిజశ్రీదేవి । అన్యాయమనకను । ఆపతివ్రతసీత ।
లోకమాతనుదెచ్చి । లోకేశునకుచాల । అపరాధివైతివి । అంతము
నొందక । యాలోకమాతను । యారామునకునిచ్చి । శరణునొందితివే
ని । నరవరుడునినుగాచు । చెడిపోకునామాట । సత్యంబునమ్ముమీ ।
సందేహమేటికి । అనితమ్ముడనుబల్క । ఆరావణుండంత । ఆమాటల
ప్పుడు । అంకుశములయితాక । భగ్గునమండిపడి । దిగ్గుదిగ్గునలేచి । దు
ర్బుద్ధిపాపిష్ఠ । ద్రోహంబనకనాకు । బుద్ధిజెప్పెదవురా । బోలదీమాటలి
క । నీతిదెల్పుమటంచు । నిన్నివ్వరడిగిరీ । నీవునాసభలోన । నుండం
గదగవింక । క్రూరాత్మబొమ్మనుచు । గోపంబుచేతను । చురచురజూ
చుచు । సరవివిభీషణుని । కడువడికాలితో । బెడిదంబుగాదన్నె । అం
తవిభిషణుడు । సభలోనతనకట్లు । జరిగినయవమానంబు । సహియింప
గాలేక । సరగుననుజనుదెంచి । తల్లికైకసితోడ । ఆరావణుడుతనను ।
అతిక్రూరబుద్ధియై । తన్నన్నమాటలు । తన్నుటయునుగూడ । క్రమ
ముగానువచించి ఘనపరాభవమును । సహియించలేనమ్మ । చాలునీ
తనిపొందు । అనిఖిన్నుడయివేడ్వ । ఆకైకసియుదను । అంతదుఃఖించుచు
చూ । తండ్రివిభీషణా ।. తనయదుఃఖంపకుము । క్రూరుడీరావణుడు ।
కుంభకర్ణుండును । పుత్రమిత్రులతోడ । రామచంద్రునిచేత । రణ
మునగూలుదురు । లోకేశ్వరుడుహరి । లోకద్రోహులపీచి । వధియిం
చుటకుదాను । దశరథరాముడై । ధామణిపైజనియించె । ఆమహాత్ముని
హరిని । శరణొందుమునాతండ్రి । స్వామినిన్నునుగాచు । యీరావణుని

జంపి । యీలంకరాజ్యంబు । నీకుపట్టముగట్టు । కులదీపకుండవై । కు లముద్ధరింపుమూ । పొమ్మనిదీవింప । సమ్మతిహర్షించి । జననికిమ్రొక్కి చును । నలుగురీమంతుౖలతో । నయముగవిభీషణుడు । చయ్యననేతెంచి । సర్వలోకేశ్వరా । సాధురక్షణరామ । దీనసంరక్షకా । దీనుడన నుగావు । రావణుతమ్ముడను । రామవిభీషణు । సభలోననాయన్న । చాలపాపాత్ముడై । తన్నినిందించిన । తత్పరాభవమును । సహింపలేక నే । స్వామినిన్నునుశరణు । వేడవచ్చితినయ్య ॥ నన్నురక్షింపుమన । రాముడుకరుణించి । అభయహస్తమునిచ్చి। రావణువధియించి । రాక్ష సరాజ్యంబు । నీకిత్తుననిపల్కి । నెమ్మదాతనికపుడె । పట్టాభిషేకం బు । పరగగావించెను । అంతనారావణుడు । మంత్రసంబుననుండి । ప్రకటమాయకుడయిన । శుకుడనుదూతను । బిలచియిట్లనిపల్కె । శుకరాక్షసానీవు । యికిబోయిరాముని । కపిసేనయెల్లను । గనుగొనిపి మ్మటను । వారిమర్మములెల్ల । ధీరుడయిగనిరమ్ము । అనిరావణుడువ ల్కె । జనిశుకుడంతటను । చిలుకరూముదాల్చి । నిలచియాకాశమున । గనుగొనుచుండగా । వానిమాయలనపుడు । కనివిభీషణుడంత । శుకు డనిమదినెరిగి । రామునితోదెల్ప । రాముడుబంపింప । అంగదుండప్పు డు । గగనంబునకునెగసి । కడిమిశుకునిబట్టి । రామునెదుటనుబెట్టి । ర యమునమర్దింప । రామదీనశరణ్య । రక్షించుదూతను । అనిప్రార్థ నముసేయ । ఆరాముడాశుకుని । కరుణించివిడిపింప । కడువడిశుకుడేగి వడకుచుదీనుడయి । రావణాసురుతోడ । రాముమహిమచెప్పి । కపిసే నకెక్కడా । కడలేదనుచుబల్కె । ఆమాటలకువాడు । అతిఖిన్నుడయి యుండె । అంతటరాముండు । ఆసముద్రముచూచి । అంతటనువారిధి । అంతరిక్షముదాక । పొడవుగానున్నదీ । వెడలువుగొప్పదీ । అవలకేగు టయెట్లు । అనుచుజింతించుచూ । దర్భశయనముజేసి । ఆశయ్యపై నుండి । అతినిష్ఠదనరారి । ఆసముద్రునిచూచి । ఓపుణ్యజలరాశి । ఓ దయావారిధీ । మాసీతరావణుడు । మాయగాగొనిపోయె । ఆసీతకై నే ను । ఆరావణాసురుని । లంకాపురముకేగి రావణాసురుజంపి । రమణి

నాసీతను । కొనివచ్చెదనుగాన । ఘనదయామతినాకు । మార్గంబువి
మ్మరుచు । మరిమరివేడగా । ఆసముద్రుడుదాను । మార్గమీయక
యుండ । మరిరాముడపుడల్గి । కోపంబుననుబల్కె । క్రూరాత్మజడమ
తీ । క్రూరాత్మధనువునను । కోలనసంధించి । కూల్తుచూడుమటంచు ।
కోల్గనుధనువు । అందుకొనితానపుడు । ఆరుద్రువలెనుండ । హడలిప
ముద్రుండు । ఆకారమునుదాల్చి । జలమునదేలుచును । సత్వరంబుగ
ననియె । జగదీశశ్రీరామ । జడుడమందుడనేను । లోకంబులకునెల్ల ।
ప్రాకటంబుగనీవు । జననరక్షణములు । ఘనలయములజేయు । త్రిమూ
ర్తిరూపుడవు । తివిరిబ్రహ్మాదులును । నీమహిమదెలియగా । నేరక
యుండగా । దెలియగానేనెంత । కరుణాపయోనిధి । కరుణించుమపరా
ధి । ననుదాటిజనుటకు । నయమార్గమెరిగింతు । వినుముదేవనలుండు ।
విశ్వకర్మసుతుండు । వానరవీరుండు । బాల్యమునందునా । సాలగ్రామం
బులను । జలధిలోయనుదినము । బారవైచగతండ్రి । పరితాపచిత్తుడ
యి । యిట్లనినుడివెను । యీనలుడెపుడయిన । పాషాణములనీట ।
బడవైచెనేనియు । మునుగకనవియెల్ల । మొనసితేలగవలెను । అనుచు
వరమునొసంగె । యీనలుడిప్పుడూ । నీసేననున్నాడు । నీవుకపులనుబం
పి । కొండలదెప్పించి । నలవానరునిచేత । నాలోనవేయింపు । యాగిరు
ల్దేలును । అట్లుసేతువుగట్టి । ఆలంకకేగుము । అనిసముద్రుడుపల్కె । అం
తర్ధానమునొందె । అంతనారాఘువుడు । యావానరులచూచి । వాన
రోత్తములార । పర్వతంబులుదెచ్చి । నలునకందివ్వుడూ । నలుడుసేతు
వుగట్టు । అనినవానరులెల్ల । యారామునాజ్ఞచే । నగములువడితెచ్చి ।
నలునకందిచ్చిరీ । యాపర్వతములను । అందుకొనినలుడపుడు । పది
యామడలవెడల్పు । బాగుగాకనుపింప । యోజనంబులునూ
రు । యుదధిలంకకువచ్చి । పొడవుగాసేతువును । పొందుగా
తనుకట్టె । ఆరాముడదిచూచి । హర్షమునొందుచూ । ఆనలునేర్పునకు
యాశ్చర్యమునుబొంది । చాలమెచ్చుచునలుని । సన్నుతులునొనరించి ।
కౌగలించుకొనుచు । కపులనుగనుగొనుచు । కపిరాజసుగ్రీవ । కదలు

దములంకపై । అనిపలుకరవిసుతుడు । యావానరులబిలచి , అందరుజ
నుడెంక । యాలంకపయికనియె , అప్పుడుసుగ్రీవాజ్ఞ । అకపులువెడలి
రి । అప్పుడుశ్రీరాముండు । యాంజనేయునిపైన । సుఖముగాగూర్చుండి
సుముఖుడైవడినేగె । అంగదునిమూపుపై । యాలక్ష్మణుండెక్కె । వాన
రులతోగూడి । వడినిట్లువెడలిరి । వానరులంతోడను । వారధివనరాశి
బంధించి । రామచంద్రునిరాక । రావణాసురుడెరిగి , తనమంత్రులను
జూచి । తగనిట్లుబలికెను , మంత్రులారాయిపుడు , మనలంకలోనికి ।
వారాశిబంధించి । వానరసేనతో । రణముచేయుటకిపుడు । రాముడేతెం
చెను । కనుకనాలోచించి । కార్యంబుదెల్పుడన । అమంత్రులిట్లనిరి ।
చారులనుబంపించి । సర్వకపులయొక్క । బలసాహసంబులు । వారినా
మంబులు । సైన్యవిస్తారంబు । సర్వముదెలియవలె । అనిమంత్రులనగ
నూ , యారావణుండపుడు । శుకసారణులబంపె । శుకములనురక్కసు
లు , గగనంబునందుండి । కపిసేనరెచుచుండె । వారివృత్తాంతంబు । వడి
విభీషణుడెరిగి , కపులకుజెప్పగా । కపులిద్దరపుడేగి , ఇద్దరబట్టుకొని ।
మర్దించిరప్పుడు । ఆశుకసారణులు । యారాముగనుగొని । దేవయీ
వానరులు , దీవ్రకోపంబున । చంపుచుండిరిమమ్ము । శరణుమాతలమ
య్య । కరుణించివిడిపించు । కాపాడుదూతలము । అనియిట్లుదీనులయి
ఆశుకసారణులు । బ్రార్థించపరాముడూ । వారినికరుణించి । విడిపింప
వారేగి , విభునిరావణుజూచి । మ్రొక్కియిట్లనిరపుడు । తక్కకమేమేగి ।
కపిసేనలోకొంత । గనుగొంటిమోదేవ । కపిసేనకంతము , గనలేకపోతి
మి । మనవిభీషణుడపుడు । మమ్మునుగురుతించి । వానరులకుజెప్ప ।
వారుమమ్మునుబట్టి , చంపబోవుచునుండ । సదయుడైరాముండు । క
రుణతోవిడిపింప । బ్రతికివచ్చితిమయ్య । అనిపల్కరంతటను , ఆరావ
ణుండపుడు । శార్దూలుడాదియగు । చారులనుబంపించె । వారలుజ
నుదెంచి । వానరరూపులై । వానరసేనలో । వడివడితిరుగుచును । కపు
లనుగనుచుండ , గనివిభీషణుడెరిగి । వానరులకుజెప్ప । వానరుల్వడిబ
ట్టి । బాధింపుచుండగా । వారురామునిజూచి । కరుణింపుమనిమ్రొ ।

గట్టిగా జేయగా । కరుణించిరాముండు ౹ కపులారదూతలను । కడకచం
పగరాదు !, గావునవీరలను । కరుణించివిడువుడనె । వారప్పుడారాము
పదములకుప్రణమిల్లి । లంకకువడిబోయి ౹ రావణాసురుతోడ । రా
మునిసుగుణము । ప్రకటించిచెప్ప । విద్వజ్జిహ్వాడనియేటి । భీకరరాక్ష
సుడొకడు । మాయగారాముని ౹ మరిధనుర్బాణంబు । శిరమునసీత
కు ౹ సరగునజూపించ । యాజానకీదేవి । అతిదుఃఖమొందెను ౹ మరిరా
వణునితాత ౹ మాల్యవంతుడుబలికె ౹ నామాటరావణా । ప్రేమతోదె
ల్పెదను । నారాయణుండేను ౹ నరరూపధరుడగుచు । రాముడైజ
న్మించె । రావణాశ్రీదేవి । రమణజానకియయ్యె । సరగనిన్నువధియిం
ప ౹ నరుడయ్యెనాహరి । పరమపావనిసీత । ధరణీశునకునిచ్చి । శరణు
నొందుముహరిని । జనవిభుడునినుగాచు ౹ అనిచెప్పరావణుడు ౹ యా
మాటవినడయ్యె ౹ అంతవిభీషణుని । మంత్రులునలుగురూ ౹ మాయా
వులైయపుడు । మరిలంకలోకేగి । రావణుమ్మనముల్ । క్రమమెల్లవ
డినెరిగి । రామచంద్రునికడకు । రయమునజనుదెంచి । ప్రణతులయి
యిట్లనిరి । రామలోకేశ్వరా । రావణాసురుడిపుడు । రణముచేయుట
కునై । నిశ్చయముజేసుకొని । నిన్నుజంపియుమీాద ॥ వానరులనుగూ
ల్చి । వనజాక్షిసీతను । వశముజేసుకొనెదనని । యశముమించెదననుచు ।
అనితనమంత్రులతో । యాలోచించుచుండెను । ఇక్కడిట్లుండగా ॥
అక్కడరావణుడు । మేడమీాదికినెక్కి । మించికోపముతోడ । ఉగ్రు
డయికపిసేన । ఒదిగిజూచుచునుండె । అంతసుగ్రీవుండు । యారావణు
నిజూచి । కోపమునసుగ్రుడయి । పాపాత్మురావణుని । జంపెదనని
పోయి । తెంపుననిట్లనియె । పాపాత్మరావణా ౹ పరమపావనిసీత ।
దొంగవైతెచ్చితివి ౹ సంగరంబుననిన్ను । వధియించిపగదీర్తు । వా
రకననిపల్కె । అంతనారావణుడు । అతికోపమునబల్కె । అరులతో
గూడుకొని ౹ అన్నజంపించితివి । చాలునీపౌరుషము । చంపెదనిన్నిపు
డె । అనగసుగ్రీవుండు । అతనికిరీటముల్ । పూడంగదన్నినను । వాడు
కోపముతోడ । పుడమికి ౹ లంఘించి । వడిదాకెనిద్దరికి । ఘోరయుద్ధం

దశకంఠుడప్పుడూ । ధరణిమూర్ఛిల్లెనూ । అంతనారవినుతుడు । అతి వేగమునవచ్చి । రామచంద్రునితోడ । ప్రకటంబుగాజెప్పె । అప్పుడు రామవిభుండు । అంగదుగనుగొని । కడువేగమునబల్కె । కపివరనీవింక। రావణుకడకేగి । ప్రకటంబుగాదెల్పు । అనిబోధగావించి । అంగదుబం పించె । అంగదుండప్పుడు । ఆరామునకుమ్రొక్కి । లంకాపురికినేగి । రావణుగనుగొని।వినకోరిరావణా । నినుచెరబెట్టిన। కార్తవీర్యార్జునిని। గం డ్రగొడ్డటిచేత।బట్టివధించిన,పరసురామునినాజి। బరిభవించినరాము। బం టుబంటునునేను । వాలంబుననునిన్ను । బంధించినాలుగు । వార్ధుల ముంచిన। బలశాలివాలికి । ఆత్మజుండనునేను । అంగదుడునాపేరు । పరమ పతివ్రిత । ధరణిజనాశీఘ్ర । అపరాధిననిపల్కి । ఆరామునకునిచ్చి । శ రణుబొందిననిన్నే । చంపకవిడుచునూ । లేకున్ననినుజంపి । ప్రాకటం బుగలంక । మావిభీషనునకు । మానకభూవిభుడు । పట్టంబుగట్టునన। రావణుడుకోపించి । రాక్షసులనుజూచి । వీనిజంపుడటన్న । వేగమునర క్కసులు । తనుబట్టగనురాగ । తానువారివధించి । మేడగూలగదన్ని । మించివేగమెవచ్చి । రామునకంతయును । క్రమముగానెరిగించె । ఆరా మవిభుడప్రుడు । ఆవానరులకనియె । వానరోత్తములార । బలమునమీ రింక । సన్నద్ధులైవేగ । జనిరాక్షసులనింక । వధియింపుడనిపల్క । వానరులందరు ।సన్నద్ధులెయపుడు । జనిలంకజుట్టిరి । అంతరాక్షసులును । అపుడతికోపమున । చతురంగబలముతో । సన్నద్ధులైవచ్చి । కపులనెదు ర్కొనిరి । కడుఘోరరణమయ్యె । సంకులయుద్ధమున । పొంకమునవా నరులు । విజయంబునొందిరి । వీరులారాక్షసులు । అపజయంబునబొంది। ఆలంకజొచ్చిరి । పాయకనప్పుడు । మాయలుగల్పించి । తండ్రిడైయే తెంచి । యింద్రజిత్తప్పుడు । పాయకమాయచే । వడిమేఘములచాల। పుట్టించిచాటునను । పొంచికనుపించక । యుద్ధముచేయుచు । యుగ్ర డై రాఘవుల। నాగపాశములచే । నరపతులబంధించి । బాణవర్షముచేత। వానరులనొప్పించె । అంతనారదమౌని । ఆరామవిభుజూడ । అతివేగము నవచ్చి । ఆరాము [illegible] నవియె । రామ [illegible] । రయము [illegible]

పుడు । నీవాహనంబైన । పావనుగరుడుని । తలచుకొన్నవతండు । రావ
చ్చునిక్కడకు । అతడువచ్చిననిన్ను । ఆనాగపాశములు । విడిచిపోవున
టంచు। వెలయుగాబోధించి । ఆనారదుండపుడ । అంతర్ధానమునొందె।
ఘనుడురాముండపుడు । గరుడునిదలచెను । తలచినంతనతండు । తగన
క్కడకురాగ । పాములుభయమంది । పార్థివులనువిడచి । భయము
నపారెను । రణమునకప్పుడు । ధూమ్రాక్షుడాదిగా । దుష్టరాక్షసుల
తో । రావణాసురుడపుడు । రయమునవచ్చెను । రావణుడుమొదలైన ।
రాక్షసులువానరుల । జంపుచునుండగా । వరవిహానుమంతుండు । ధూ
మ్రాక్షుమడియించి । దుష్టునకంపనుని । జంపినగనుగొని। సక్రోధుడై
అపుడు । వడిమహాకాయుండు । వానరులపైబడియె । అదిచూచికోపము
న । అంగదుండెదిరించి । ఆమహాకాయుని । హతముగావించెను । నీ
లుడప్పుడువచ్చి । గూల్చెప్రహస్తుని । హతశేషులపుడేగి । ఆరా
వణునితోడ । అంతయుజెప్పగా । ఆరావణాసురుడు । అతికోపియై
మండి । రణమునకురాబోవ । రమణిమండోదరి । యెన్నెన్నినీతులను ।
యెరిగిచెప్పినగాని । పెడచెవులబెట్టుకొని । వెడలిదశకంఠుండు । రణభూ
మికప్పుడ । రయముననేతెంచి । వానరులనొప్పింప । అదిచూచిహను
మంతుడు । ఆరావణునితోడ । ఘోరయుద్ధముచేసి । మూర్ఛనొందిం
చెను । అంతనారావణుడు । అతివేగమునలేచి । కపిసేననంతయును ।
గారించుచుండగా । కనిలక్ష్మణుండపుడు । కడుకోపమునవచ్చి ।
నిలునిలురావణా । నిన్నుబోనిత్తునా । అనిలక్ష్మణుడుబల్క । ఆ
రావణుండపుడు । తీవ్రకోపంబున । దివ్యబాణంబులు । లక్ష్మణస్వామి
పై । లక్షలుబరపెనూ । అంతనాలక్ష్మణుడు । ఆబాణములనెల్ల । మ
ధ్యనేఖండించి। మహనీయమూర్తియై। కఠినబాణములేసి । కాయంబునొ
ప్పింప । దివిరియారావణుడు । త్రీవ్రబాణములచే । మొనసినొప్పింపగా।
మూర్ఛిల్లెలక్ష్మణుడు । అదిచూచిరాముండు । అతివేగమునవచ్చి । దీ
పించుకోపమున । పాపిష్టిరావణా । వరసతులవచించి । పాపంబుదలప
క । దెచ్చుటగాదిది । అచ్చపురణకేళి । నాకంటబడితివి । నీకిప్పుడ

చ్చటికి । బోవచ్చురాయిపుడు ॥ పూనిబ్రహ్మాస్త్రములును । నిన్నుగాచుట
కున్నె । నీకడ్డమొచ్చినను । నాబాణములచేత । నాశనమునినుజేతు । పా
రిపోజూచినను । పారిపోనిత్తునే । కంపింపకనునిలువు । కడతేర్తునిన్నిపుడు ।
ఆరాముడీబలుక । ఆరావణాసురుడు । పటుశరములనేసె । పక్షం
బునాటించే । రామచంద్రుండపుడు । రయమునవారించి । సవ్యాపస
వ్యముగ । దివ్యబాణములేసి । సారథినిగుర్రముల । సమయింపవిరథుడై ।
అంతనారాముని । చెంతనుండగవెరచి । భయమునరావణుడు । వడిపారి
పోయెనూ । ఆరావణాసురుడు । అవరాభవమును । సహింపయింగాలేక ।
పరగునరాక్షసుల । గనుగొనియిట్లనియె । ఘనుడునాసోదరుడు । కుంభ
కర్ణుండతని । కొనక్కొనిలేవుడు । అనిరాక్షసవిభుండు । ఆజ్ఞసేయగవారు ।
మాంసపురాసులు । మద్యభాండంబులు । పదినూర్లకుండలు । పచ్చిరక్త
ములును । యేనూరుదున్నలు । యేనూరుమేకలు । పదిమందినరులను ।
పంచభక్ష్యాన్నములు । కొనివచ్చివారపుడు । యోజనంబువెడల్పు ।
యోజనములుమూడు । పొడవై యుండియు । భువనంబువలెనుండి । దగుకుం
భకర్ణుని । తృల్పగృహమునగేగి । కాలమృత్యువుబోలె । కలవరించుచువా
డు । బుస్సలుకొట్టుచు । ఘోరుననిద్రింప । వారందరునుజేరి । వానిశరీ
రమును । ముసలములమొత్తిరి । ముష్టులబొడిచిరీ । మదపుటేనుగుల
చే । మట్టించిరప్పుడు । గునపములుగాలిచి । తనువెల్లగాలిచిరి । సీసంబు
మరిగించి । చెవులలోబోసిరీ । విడువక చెవులలో । పెడబొబ్బలెట్టిరి ।
ఆకుంభకర్ణుండు । అప్పుడుమేలుకని । లేచియారక్కసుల । జూచియిట్ల
నిబల్కె । దనుజులారామీరు । నను లేపినారేమి । యొందుకులేపిరో ।
యెరిగింపుడనిపల్క । రాక్షసులిట్లనిరి । రాక్షసాధిపవినుము । ఘనుడు
రాముండిపుడు । కపిసేనతోగూడి । వారధిబంధించి । వారిధివడిదా
టి । మనలంకపైబడి । మనబంధువులనెల్ల । జంపిమనరాజుని । సమ
భూభాగమున । మర్మముల్నాటింప । మనరావణుడుచాల । నవజయు
న్నడై । అతివేగమునినిన్ను । లేపుడనిబంపగా । లేపితిమినిన్నుపుడు ।
గనుకనీభక్ష్యములు । దినిదయచేయుమనిరి । ఆకుంభకర్ణుండు । అతివే

గమునలేచి । ముఖమునుకడిగికొని । మొనసియాహారముల్ ।
సర్వంబుభక్షించి । సర్వరాక్షసులతో । ఘనసభకేతెంచి । దనయన్న
కును మొక్కి । నాయన్న రావణా । నన్నేలలేపితివి । యెవడునీతోనిపు
డు। యెదిగివైరిముఁబూనె । ఆముఖ్యమ్ము జెప్పుమన్న । ఆరావణుండతని । దీ
వించిదీనుడై । దివిజసమగ్రిముగ । యంతవృత్తాంతంబు । అతివేగమున
దెలిపి । తమ్ముడానీవేగి । తప్పకావానరుల । నరులనువడిజంపి । నాకిమ్ము
సీతనన । అన్నతోనప్పుడూ । ఆకుంభకర్ణుడనె । రామఃశానాయన్న ।
రాక్షసేశ్వరవినుము । నారదుండొకనాడు । నాతోడజెప్పెను । నారా
యణుడుమనల। నాశనమొనరించుటకు। శ్రీరాముడై పుట్టి। వారిధిబంధిం
చి। వానరులతోవచ్చి । మనలవధించునని । ఘనుడునాతోజెప్పె । కావు
నహారితోడ । కలహంబుమనకేల । శీఘ్రమునరామునకు ॥ సీతనిచ్చిపం
పు । అనికుంభకర్ణుడన । అరావణుడుబల్కె । భండనంబన్నను । భయ
మునీకిటులున్న । నీవువేగమెపోయి । నిద్రపొమ్మికనేను । దురమునఘను
డనై । నరవానరులజంపి । సీతావధూటితో । చెలగిరాజ్యముసేతు । సీ
తనిచ్చుటకంత । చేతగానివాడనే ॥ పొమ్మనినిందింప । సమ్మతినతడని
మె । అన్న నేనిపుడేగి । ఆనరవానరుల । క్షణములోమ్రింగెదను । సం
కోచమేలనూ । శలవిమ్మనుచుబలికి । చతురంగబలములతో । కుంభిని
గదలంగ । కుంభకర్ణుడువచ్చి । వానరులమునుముగా । వడిగూల్చు
చుండగా। అరామచంద్రుడు । అతితీవ్రశస్త్రముల । ఆదనుజునినొప్పిం
చె । వాడునుశూరుడై । వడిరామునెదిరించి । కఠినబాణములేయ । క
నలిరాఘవుడపుడు। చేతులుదెగనరికి । చెక్కెదేహమునంత । పాదముల
నునరికి । వడిశిరముఖండించె । కుంభకర్ణుండిట్లు । గూలగాభయమున ।
హతశేషులైనట్టి । అసురులువడిపారి । రావణాసురుతోడ । రాముడక్ర
మమున । కుంభకర్ణునిబట్టి । గూల్చెనని చెప్పగా । ఆరావణాసురుడు ।
అతిదుఃఖమునఁబొంది । తమ్ముడాబలశాలి । తండ్రికుంభకర్ణ । నన్నును
విడనాడి । నరుచేతగూలితే । నీవులేకున్నను । నిజముగావినుమయ్యా ।
యింకనీలంకేల । య్యాప్రాణమేటికి । ఘోరీతిశోకింప । శూరులురా

క్షసులు । దేవాంతకాదులు, దేవమష్మానుబంపు । దీనత్వమిదియేల । న
రవానరులజంపి । మరలివచ్చెదమనగ । ఆరావణాసురుడు । ఆజ్ఞవారికి
నిచ్చె । చతురంగబలములతో । చయ్యనరాక్షసులు । వచ్చివానరులను ।
బాధింపుచుండగా । అంగదుడప్పుడు । అనుపార్శ్వునిజంపె । రామచం
ద్రుడపుడు । రణముననుగ్రుడై । దేవాంతకునిగూల్చి । దివిరినరాంతకు
ని । సంహారమొనరించె । సరగుననంగదుడు । ఆమహాకాయుని । అతివే
గమునగూల్చె । అతికాయుడప్పుడు । అతివేగమునవచ్చి । వానరులను
ప్పింప, వడిలక్ష్మణుండేగి । రయముగాధనువునను । బహ్మాస్త్రమును
గూర్చి । అతికాయశిరమును । అతివేగఖండించె । హతశేషరాక్షసు
లు । ఆలంకలోకేగి । అతికాయుమరణంబు । అధిపునకుజెప్పిరి । అంత
నారావణుడు । అతిదుఃఖమునుబొందు । యిందృజిత్తునుజూచి । యిప్పు
డునీవేగి, తనయుడావానరుల । తగరాఘవులజంపి । కౌతుకంబునునా
కు । గావింపుమనిపల్క । తండ్రిచరణములకు । తగమ్రొక్కివీడ్కొని।
చతురంగసేనతో । సన్నద్ధుడైకదలె । ధరణిచలించెనూ । తగవారిధులు
గలగె । యిందృజిత్తుండపుడు, యీతీరుననువచ్చి । వానరసేనలు । బ
డలువరపగదొడగె । అంతనావానరులు । అగములనగములును, ఆ
యింద్రజిత్తుపై । కురియుచునుండగా । కోపంబుదీపింప । ఆయింద్రజి
త్తుండు । అవియెల్లదెగటార్చి । బ్రహ్మాస్త్రమునువేసి । వానరులనంద
రును । రామలక్ష్మణులను । రయమునపడగొట్టి । లంకలోనికిబోయి ।
తండ్రియావానరుల। తగసంహరను నేను। చంపివచ్చితినన్న । రావణాసురుడ
పుడు । రయమునతనసుతుని । ఆలింగనముచేసి । ఆనందమునుబొందె ।
అపుడువిభీషణుడు । ఆంజనేయుండును। జాంబవంతుడును । సరవిబ్రహ్మా
స్త్రమును । భక్తిజపించుటను । వారుగూలకయుండిరి । అపుడుజాంబ
వంతుండు, ఆంజనేయునిబిల్చి । ఆంజనేయుడయపుడు । అందరుగూలి
రి । కనుకనీవిప్పుడు । కడువేగముననేగి । సంజీవపర్వతము । చయ్యనతె
చ్చియీ । జనులనుబ్రతికింపు । అనిపల్కయతనికి । ఆనవాళ్ళనుజెప్ప ।
అంజనేయుండేగి । ఆపర్వతముదెచ్చె । ఆగాలిసోకగా । అందరుబ్రతికిరి ।

ఆంజనేయుండవుడు । ఆపర్వతంబును । యొప్పటిచోఁబెట్టి । యేతెంచెర
యమున । వానరులప్పుడు । వడిలంకఁగాల్చిరీ । కొందరురాక్షసులు ।
గూలిరాయగ్నిలో । కంపనుడుమొదలైన । ఘనరాక్షసులువచ్చి । వాన
రులనొప్పింప । వానరవీరులు । వారినిగూల్చిరి । కుంభకర్ణసుతుండు ।
కుంభుడెదుర్కొన । వానిసుగ్రీవుండు । వడిజంపివేసెనూ । అన్నగూలు
టజూచి । అతికోపదీప్తుడై । అదరినికుంభుండు । హనుమంతునొప్పించె ।
హనుమంతుడప్పుడు । అనికుంభునిగూల్చె । ప్రకటబలిశాలియూ । మక
రాక్షుడేతెంచి । రామునినొప్పింప । రాముడామకరాక్షు । రయమునదె
గటూర్చె । హతశేషరాక్షసుల । ఆతిభయమునబారి । అరావణునితో
డ । అంతవృత్తాంతంబు । యెరిగింపదుఃఖంచి । యిందరిజిత్తునుజూచి ।
తనయనీవిపుడేగి । తగినరవానరులు । జంపిరంమనిబంప । యిందరిజిత్తు
డువచ్చి । యినకులులయెదుటను । మాయసీతనుజంపె । మానవేశ్వరు
డంత । మనమునదుఃఖంచె । ఘనుడింద్రజిత్తపుడు । దనరంగనొకచోట ।
అభిచారిహోమంబు । అచరింపుచునుండె । అవిభీషణుడంత । అధూ
మమునుచూచి : అహోమవిధమెరిగి । రామునకుజెప్పంగ । రాము
డాలక్ష్మణుని । పంపనాలక్ష్మణుడు । వానరసేనతో । అనికుంభిలకేగి ।
అహోమవిధిచెరచి । అయిందరిజిత్తుతో । అతిఘోరయుద్ధంబు । జే
సియూరక్కమునిని । వాసిమీరగగూల్చె । హతశేషరాక్షసులు । అలంక
లోకేగి । యిందరిజిత్తునిచావు । యెల్లనుయెరిగింప । బోరునదుఃఖంచి । యీా
దుఃఖమునకెల్ల । యీసీతకారణము । కావునసీసీత । కడగిజంపెదవను
చు । ఖడ్గంబుచేబూని । కనలిబోవుచునుండ । కొందరురాక్షసులు । కూ
డదుస్త్రీహత్య । తగదుమానుమటంచు । తప్పించిమాన్పిరీ । రావణుండ
ప్పుడు । పరికటమూలబలంబు । పంపగానాసేవ । వసుధగక్కిదలంగ
సాగరములుగలగ । చయ్యనచేతెంచి । వానరులదరమంగ । వడిరామ
చంద్రుండు । సింహమేనుగులను । చించిచండాడుగతి । మూలబలంబు
ను । గూలిచిజంపెను । అతిభయగ్రస్తులై । హతశేషరాక్షసులు । లం
కాపురికిబారి । రావణాసురునితో । మూలబలనాశంబు । మొనసిచెప్ప

గవాడు । మేనువడవడవడక । మిక్కిలిదుఃఖించి । తనమదిలోఁగొంత ।
ధైర్యంబుదెచ్చుకొని । చతురంగబలములతో । సన్నద్ధుడైవెడలె । వ
సుధగంపించెను । వారిధుల్గలగెను । నక్షత్రములురాలె । నభమునిడు
గులగురిసె । దుర్నిమిత్తములెన్నో । తోవలోఁగనుపించె । వానిలెక్క
గొనక । వచ్చెనురణమునకు । వాడిబాణములచే । వాడిమిమెరయుచు ।
వానరులనొప్పింప । వచ్చెసుగ్రీవుండు । వీరువిరూపాక్షు । వేగమునగూ
ల్చెను । తరువాతనుస్మత్తు । తప్పకగూల్చెనూ । అంగదుడప్పుడూ । అ
తికోపదీప్తుడై । శూరుసుపార్శ్వుని । ధీరతవధియించె । రామచంద్రుం
డపుడు । రావణునెదిరించి, రణశూరుడై సిలచె । ఘోరంబుగానపుడు । ధీ
రులై యిద్దరును । సమముగాబోరంగ । చనివిభీషణుడపుడు । రాము
నికడ్డమై । రావణాసురుతోడ । రణముసేయుచున్నుండ । రావణుడుకోప
మున । వెసవిభీషణుమీద । విడువశక్తిధరింప । భయమునవిభీషణుడు ।
వడకుచునుండగా । రావణుడాశక్తి । రయమునవిడచెను । అదిచూచిల
క్ష్మణుడు । అడ్డంబుగానేగి । తనవెనుకప్పుకడు । తగవిభీషణుదోలిచి, మ
గతసంబుననున్న । మండుచునాశక్తి । వచ్చియాలక్ష్మణుని । వక్షంబు
దూరెను । ఆలక్ష్మణుండపుడు । అబాధకోర్వక । అవనిపైమూర్ఛిల్లె ।
అరాముడప్పుడు, అతికోపమునవచ్చి । పావకుండునుబోలె । రావణాసు
రుదాకి । తీవ్రాస్త్రములనేసి । తిమిరినొప్పింపగా । కడునొచ్చిరావణుడు
కాందిశీకుండగుచు । రామచంద్రునియెదుట । రణముసేయగవెరచి, భ
యమునశంకిచి, పారిపోయెనుపురికి । అంతఃపురముజేరి, అతిదీనుడై
యుండి । యేదిక్కుచూచినను । ఆదిక్కునందెల్ల । యేవస్తువునుజూడ ।
అవస్తువెల్లను । రామునిరూపమై । ప్రకటముగనుపింప, భయము
ననడలుచు । వడకుచునుండగా । మండోదరేతెంచి, దండంబుగావించి
నాథనామనవిని । నయమునవినవయ్య, యింద్రజిత్తునినొకని, మెలమిన
తికాయుని । కుంభకర్ణునిగూడ । గూలిచెరాముడు । రాక్షసవీరులను
రణమునగూల్చెను । నరుడుగాడీతండు । నారాయణుండయ్య । ఆసీతరా
మునకు । అతివేగనర్పించి । శరణబొందుమునిన్ను, జనవిభుడురక్షించు । అ

నికాంత్రపలుకగా । అమాటవినకుంటి । కాలనేమినిబిలచి । ఘనమాయ సీవిపుడు । సంజీవిదేకుండ । చయ్యనసన్నద్ధమై । యీరాత్రిగడపుము ॥ మెగుమనిపంపగా । కాలనేమియునంత । గదలితయాంమార్గమున । తన మాయచేసపుడు । తాపసాశ్రమమపుడు । థాన్యమాలికొలంకు । దగ్గరసం దముగ । గల్పించియందులో । కపటమునియైయుండె । అంతనక్కడజూడ ఆరామచంద్రుండు । తమ్ముడాలక్ష్మణా । తెగునయ్యనను బాయ । నన్నునువిడ నాడి । నాకమునకేగితివ । భక్తుడవై నాకు । పరిచర్య చేయుచు । అర ణ్యములలోను । అతికష్టపడితివి । నీవులేకన్నను । నిజముబల్కెదవినుము । సీతనాకేటికి । జీవనంబేటికి । రాజ్యంబునాకేల । పరికటవిభవమదేల ॥ అనిచాలదుఃఖించి । అంజనేయునిజూచి । తండ్రియాంజనేయ । తగనీవు వడినేగి । సంజీవనిదెచ్చి । సరగుననాకిపుడు । తమ్మునియ్యమటంచు । త గబల్కనతడపుడు । రామునకువడిమ్రొక్కి । రయమునచనిచని । మా ర్గంబులోనున్న । మానిమాశ్రమమునకు । జలదాహమునకునై । చయ్య నడిగిమ్రొక్కి । జలములనిమ్మన్న । సత్వరముగనతడు । కమండలోదక ము । కడువేగముననిచ్చె । అజలములనుద్రావి । హనుమంతుడప్పుడు । చాలవనిలిప్పనను । సంయమియిట్లనియె । కొలనున్నదిక్కడా । కోరి యచ్చటకేగి । నీవుతృప్తిగనందు । నీరముదాగుమనె । హనుమంతుడ ప్పుడు । ఆకొలనులోదిగి । జలముద్రాగుచునుండ । సరగుననొకమొసలి హనుమంతువడిమ్రింగె । హనుమంతుడప్పుడు । అమొసలినిజంపె ॥ అది అప్సరూపమై ॥ హనుమంతునకుమ్రొక్కి । తనవిధంబెల్లను । తగనపుడు బోధించె । కాలనేమియితండు । కపటమునిరూపమున । నిన్నుమోస ముచేయు । నున్నాడు వడిజంపి ॥ జనుమనిబోధించి ॥ సతితానుబోయెను । హనుమంతుడప్పుడు । అరక్కసునిజంపి । అతిరయమునజని । సంజీవప ర్వతము ॥ చయ్యనబెకలింప ॥ పర్వతపాలకులు । వసుసగంధర్వులు । అడ్డమైయెదిరింప । అందరినిజయించి । సిరముననాకొండ । వెలుగుచు నిడుకొని । వచ్చుచునుండగా భరతుడుగనుగొని ॥ భూతమనిమదినెంచి పొలియింపగాజూడ ॥ దివ్యదృష్టినిమునులు ॥ దెలసిచెప్పగనతడు ॥

మానియమారకయుండె । మరియాంజ నేయుడు । వడిసముద్రముపై నెగసి వచ్చుచునుండగా । రావణునాజ్ఞచే । రాక్షసులుకొంద రు । మాల్యవంతునితోడ । వచ్చియెదురొక్కని । ఘనశూలములుగదల్ । కఠినబాణము లును । ముద్గరాయుధములు । ముసలతోమరములు । కుప్పలుగాగురి య । తప్పకసవియెల్ల । లక్ష్యంబుచేయకను । రాక్షసులనెల్లరు । మడి యించియిట్లపైని । మాల్యవంతునిజంపి । వడివచ్చిపర్వతము । కైలా భూమినుంచెనూ । వడినుపేణుండపుడు । పర్వతముపైకెక్కి । సంధాన కరణియును । సౌవర్ణకరణియును । సంజీవకరణియును । విశల్యకరణియు ను దెచ్చియాలక్ష్మణుని । దేహమునకురాయ । లక్ష్మణుండపుడు । నిద్రలేచి నయట్లు । నిముషమునలేచెను । ఆరామునాజ్ఞచే । హనుమంతుడప్పు డు । పర్వతముగొనిపోయి । పూర్వపుస్థలమునను । వుంచివేగమువచ్చి । యెంచిమార్గములోన । స్థూలజంఘాదులను । దనుమాడెరక్కసుల । జ నవిభుడువానరులు । చాలసంతోషించె । రావణుడప్పుడు । రయమునశు క్రునితో । ఆలోచనముచేయ । ఆశుక్రుడిట్లనెను । రావణాసీవిపుడు । ర మ్యముగకుండంబు । పరువడిచేయించి । పాతాళహోమమును । చేసి తివేనియు । శ్రీరామలక్ష్మణుల । వానరులనందరిను । వధియింపవచ్చు ను । అనిగురువుబలుకగ । ఆరావణుండంత । పాతాళహోమమును । వారికచేయగా । అదివిభీషణుడెరిగి । అంగదాదికపుల । అతివేగబంప గా । ఆకపులువడిజనిరి । అంగదుడప్పుడు । ఆరావణునిభార్య । మండో దరినిబట్టి । మరిరావణునికడకు । యీడ్చితెచ్చినంత । యింతిభర్తను చూచి । యిదియేలహోమంబు । యీకపులునన్నిపుడు । యీడ్చు చుండిరి । యికచాలులేలెమ్ము । అనికాంతబలుకగా । ఆరావణుండప్పు డు । హోమంబుచాలించి । యుద్ధమునకువచ్చి । వానరులనొప్పింప । వానరశ్రేష్ఠుండు । గిడగిహనుమంతుండు । ఖడ్గరోముని జంపి । వెసనర్ప రోముని । వృశ్చికరోముని । హనుమంతుడేజంపె । ఆరామచంద్రుండు అగ్నివర్ణునిజంపె । రామరావణులపుడు । రణముఘోరంబుగా । ఢీకొని చే యుచునుండ । దేవేంద్రుడప్పుడు । దశరథమురామునకు । దానుపంపిం చెను । అరథముమాతలి । ఆరామవిభునికడకు । కొనివచ్చియెక్కుమను । కూర్చుండెరాముడు । రావణునితలలను । రయమునద్రుంపగా । ఆరా

వణునితలలు । అపుడె మొలచుచునుండె । అదిచూచిరాముండు । అద్భుతచిత్తుడై । ఆయాసమును బొంద । అగస్త్యముని వచ్చి । వసుధేశ రావణుని । వక్షంబులోపల । అమృతకలశముగలదు । ఆగ్నేయబాణమున । ఆయమృతకలశమును । అతివేగ బడగొట్టి । తరువాతతలలెల్ల । తప్పకఖండించు । అనియుపదేశించి । అగస్త్యుడేగనూ । అంతనారాఘవుడు । ఆగ్నేయశరమునను । అమృతకలశంబును । అతివేగ ఛేదించి । తరువాతరావణుని । తలలెల్లతెగనేసె । అంతనారక్కసుడు । అవనిపైబడిచచ్చె । ఆవిభీషణుడపుడు । అన్న చచ్చుటచూచి । అతిదుఃఖమున నేడ్చె । ఆరావణుని చావు : అంతఃపుర స్త్రీలు । మొరిగిదుఃఖంచిరీ । యింతిమండోదరి । అతిదీనయై యేడ్చె । అంతవిభీషణుడు । అగ్నిసంస్కారంబు । అన్నకును నొనరించె । రామచంద్రుండపుడు । రాక్షసరాజ్యంబు । వడివిభీషణునకు । పట్టాభిషేకంబు । గావించెనప్పుడు । గడగిహనుమంతుండు । రయముగానపుడేగి । రాముని విజయంబు । రావణాసురుచావు । ప్రకటంబుగాజెప్పె తగవిభీషణుండు । తనభార్యలను బిలచి । ఆసీతకప్పుడు । అభ్యంగనాదులును । జేయుడనిబలుకగా । శీఘ్రముగ వారేగి । సీతాసతీమణికి । సంపెంగతైలమున । చక్కగాతలయంటి । రత్నభూషణములను । రయముగనలంకరించి । పట్టుచీరనుగట్టి । భాసిల్లజేసిరి । అందలమెక్కించి । అందరుగూడుకొని । ఆరామసన్నిధికి । తోడ్తెచ్చివిభునకు । తోడి సమర్పించిరి । అంతనారాఘవుడు । అనుమానభరితుడై । అపవాదభయమున । అంగీకరింపక । అప్పుడూరకయుండె । అంతనాజానకి । అతిదుఃఖమొందుచును । తనువేలనికననుచు । తనమదిచింతింప । అగ్నిహోత్రములోన । అపుడుప్రవేశించె । అగ్నిహోత్రుండపుడు । అతిచలువజేయుచును । దివ్యరూపముదాల్చి । [illegible]వినాసీతను । చేతులతోనెత్తి । శ్రీరామదేవేశ । యీశ్వరావినుమయ్య । యాసీతయకలంక । పరమపతివ్రత । ధరణితనూజాత । లోకైకమాతసుమ । ప్రకటముగనమ్ము । తప్పిదయును లేదు । తనమదినిన్నెపుడు । దలచుచుండునుగాని । దానన్యమెరుగదు । అనిరామచంద్రునకు । అప్పగించిచనెను । శివుడును బ్రహ్మయును । చేరియింద్రాదులును । యిట్లనిరాముని । మొరిగినుతించిరి శ్రీరామరఘురామ । శ్రీజగన్నాయకా । లోకంబునకునెల్ల । ప్రకటంబుగనీ

వు । జననసంరక్షణలు । సంహారములుజేతు । పరమాత్మవీశుడవు । వా
సుదేవుడనీవు । నీమాయలోబడి । మేముందుమెప్పుడు । నారాయణు
డనీవు । నరరూపధారివై । దేవమానవులను । దివిరిహింసలుసేయు ।
పాపాత్మురావణుని । బంధుమిత్రులతోడ । రణమునదెగటార్చి । ప్రి
ఖ్యాతిజెందితివి । సుఖులైతిమిమేము । సుఖులైరిజనులెల్ల । లోక
మాతాసీత । లోకేశ్వరుడనీవు । అనిరామవినుతించి । అందరువడిజనిరి
ఇంద్రుడాకపులపై । యెలమిసంతుష్టుడై । అమృతవర్షముగురియ । అం
తమృతకపులెల్ల । అప్పుడేబ్రతికిరి । అంతనారాఘవులు । ఆనందమును
బొంది । ఘనపుష్పకంబెక్కి । కదలిరయోధ్యకు । పూర్వవృత్తాంతంబు ।
పుణ్యుండురాముండు । సీతకుజెప్పుచును । చెలగుచునుండెను । ఆకాశ
మార్గమున । ఆపుష్పకవరంబు । వాయువేగంబున । వడివచ్చుచుండెను
సీతవానరసతుల । చేరిచూచెదననుచు । కోరినరాముండు । కూర్మితోన
పుడు । కిష్కింధకేగియా । కీశనాథునితోడ । సుగ్రీవవానరసుదతులని
టకు పంపింపుమననతడు । బిలుపింపవానరుల । సతులెల్లవచ్చిరి । సంత
సంబునను । ప్రేమనాసీత । పాదంబులకుమ్రొక్కి । జనకజవారల । స
త్కరించుచును । పుష్పకమెక్కించి । పోలుపారవారితో । అలరిభర
ద్వాజు । ఆశ్రమముజేరి । ఆమునికిదగమ్రొక్కి । యతిథిపూజలదంది ।
మునిపిందుగావింప । ముదమునభుజియించి । అక్కడాదినముండి । హ
నుమంతుగనుగొని । ఆంజనేయానీవు । అతివేగమునసిపుడు । నందిగ్రా
మముకేగి । భయశాలిభరతుతో । మనరాకజెప్పుమా । యనిబంపనత
డేగి । భరతునిగనుగొని । వందనములుజేసి । భరతరాజాయిపుడు । ధ
రణీశుడేతెంచి । వరభరద్వాజుని । వనముననున్నాడు । తనవృత్తమెల్ల
ను । తగనీకుదెల్పుమన । నన్నుబంపగనేను । నరనాథవచ్చితిని । రా
మచంద్రుడురేపు । రమణనయోధ్యకు । వచ్చునని దెలుపగా । భరతు
డానందించి । ఆయాంజనేయునకు । అపుడుబసదనమిచ్చి । బ్రాహ్మణుల
బిలిపించి । వరుసభూదానాది । దానములుతగజేసి । అప్పుడయోధ్యా
పురము । అలంకరింపగజేసి । తల్లులనుమిత్రులను । తగపరివారము ।
వరరథాశ్వగజాది । వాహనములనెక్కి । రామునకెదురేగి । రయమున
మ్రొక్కెను । శత్రుఘ్నుడును మ్రొక్కె । జననాథుడప్పుడు । వారికౌగి

ఉజ్జేర్చి । వేరునతో తల్లులకు । తమ్మునితోడను । తనసతిసీతతో । మ్రొక్కెగతల్లులు । మోదంబునొందుచును । కౌగలించుకొనిరి । సకగి రామచంద్రుండింకప్పుడు । రథముపైగూర్చుండి । అందరితో గూడి । అ యోధ్యపురికేగె । సీతకభ్యంగంబు । చెలులుగావించిరి । రామలక్ష్మ ణులకు । రయమునభరతునకు । జటలనువదిలించి । సంపెంగతైలము న । తలలంటిరిసతులు । తగవారుముచ్చటా । పీతాంబరములను । ప్రేమ తోధరియుంచి । భూషణములుదాల్చి । పాలుపారిరప్పుడు । దేవతులపో లికను । దీపించుచుండిరి । ఆభరతునాజ్ఞచే । ఆకపివరులేగి । బంగారు చెంబులతో । పయోధిజలములను । పుణ్యనదులజలము । పాలుపారిదె చ్చిరి । వసిష్ఠాదిమునులును । వడినరుంధతిమొదలు । పరమపతివ్రతలు వచ్చిరిమంత్రులును । వసుధాధిపతులును । ఆస్థానమంటపమున । అం దరుగూడిరి । మంగళవాద్యములు । పొంగుచుజేయించిరి । వారభామి నులను । వడివడిపిలుపించి । మెండుగానప్పుడు । మేళములుజేయించిరి మానులందరు ప్రీతి । మంత్రిముల్చదివిరి । మంచిముహూర్తమున । మౌని వసిష్ఠుండు । శ్రీరామచంద్రుని । సింహాసనముమీద । కూర్చుండగాబె ట్టి । కోర్కెవసిష్ఠుండు । ఆపుణ్యజలముచే । ఆరామచంద్రునకు । ప ట్టాభిషేకమును । పరగంగజేసెనూ । గన్నులపండువగ । గనిరందరప్పు డు । భరతునకప్పుడు । పరమమోదమునను । యువరాజ్యమునకిప్పుడు అభిషేకమొనరించె సురదుందుభులుమొరసె । సూర్యచంద్రాదులు । కాంతిచేనొప్పిరి । గగనమునందుండి । పుష్పవర్షముగురిసె । మునిముని దిరసురులు । వినుతించిరిమరులు । వెలయునాకాశమున । ప్రకట సంతోషమున । రంభాదులాడిరి । శ్రీరామచంద్రుడు । చెలగుచునప్పు డూ । ఘనుడుసుగ్రీవాది । కపులకునెల్లనూ । ఆవిభీషణముఖ్య । అసు రవరులకునెల్ల । తగుబహుమానములు । తానప్పుడిచ్చెను । అప్పుడా వానరులు । ఆరామస్తోత్రములు । ఆరామువిభునకు । అతిభక్తితో మ్రొక్కి । ఆరాముునాజ్ఞచే । అధికమోదముతోడ । తమతమపురములకు । తగనప్పుడేగిరి । అంతనారాఘవుడు । అతిధర్మశాలియై । తనసతిసీతతో । తగనుమోదంబున । పాలింపుచుండగా । ప్రజలు సుఖిరి । చరితోదించదనామములు సంపూర్ణము

